# విషయసూచిక


శ్రీరామ స్తుతి ... ... ... ౧౧౫
శ్రీ రామకృష్ణ వచనామృతము—'మ.' ... ... ... ౧౧౬
శ్రీ వివేకానంద స్మృతి ... ... ... ౧౧౯
ప్రపంచ మతములు—శ్రీ నిత్యానందస్వామి ... ... ... ౧౩౧
రాణి రాస్మణిదేవి—శ్రీ దువ్వూరి రామకృష్ణారావు, బి. ఏ. ... ... ౧౩౬
శ్రీ మాతృదేవికి సోదరి నివేదిత లేఖ ... ... ... ౧౪౦
శ్రీ వాసుదేవ మననము—శ్రీ మాచిరాజు శ్రీరామకృష్ణ ... ... ౧౪౧
శ్రీ తురీయానంద లేఖావళి ... ... ... ౧౪౨
సంఘవార్తలు : శ్రీ రామకృష్ణపరమహంస దేవుని నూటపదునెనిమిదవ
జన్మదిన మహోత్సవము ... ... ... ౧౪౮
కాకినాడలో శ్రీ రాఘవానందజీ మహరాజ్ వారి ఉద్బోధన ... ౧౪౯
గ్రంథ సమీక్ష ... ... ... ... ౧౫౦


# గిరీశచంద్ర

(గిరీష్‌బాబు చరిత్ర)

రచయిత : శ్రీ దువ్వూరి రామకృష్ణరావు, బి. ఏ.

ఇది శ్రీ రామకృష్ణపరమహంస దేవుని గృహస్థశిష్యుడగు గిరీష్‌బాబు చరిత్రము. గృహస్థులు ఆధ్యాత్మిక రంగమున ననుసరింపదగు విధులన్నియు నిందు ఈ మహాశయుని జీవితమున జదువనగును.

ప్రజ్జ్వలమగు ప్రథమముద్రణము !

వెల : రూ. 0-12-0




# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౯ } ౧౯౫౩ - మార్చి : : నందన - ఫాల్గుణము { సంచిక ౯


## శ్రీ రా మ స్తు

శ్లో. శాంతం శాశ్వత మప్రమేయ మనఘం
నిర్వాణ - శాంతి - ప్రదమ్
బ్రహ్మా - శంభు - ఫణీంద్ర - సేవ్యమనిశం
వేదాంత వేద్యం విభుమ్
రామాఖ్యం జగదీశ్వరం సురగురుం
మాయా మనుష్యం హరిం
వందేఽహం కరుణాకరం రఘువరం
భూపాల చూడామణిమ్॥

శాంతస్వరూపుడును, శాశ్వతుడును, సాటిలేని సద్గుణములు గల వాడును, పాపములను పోగొట్టువాడును, మోక్షసుఖమును ప్రసాదించువాడును ఎల్లప్పుడు, బ్రహ్మ, రుద్రుడు, ఆది శేషుడు మొదలగువారిచే సేవింపబడువాడును, వేదములందు తెలియవచ్చు సద్వస్తువగువాడును, విభుడును, దేవతలగురుపును, తన మాయచే మానుషరూపమును దాల్చిన హరియును, కరుణాకరుడును, రఘుశ్రేష్ఠుడును, భూపాలకులలో చూడామణివంటివాడును అగు శ్రీ రాము డను పేరుగల జగదీశ్వరునకు నేను నమస్కరించుచున్నాను.



ఓం నమో భగవతే శ్రీ రామకృష్ణాయ !

# శ్రీ రామకృష్ణ వచనామృతము — 'మ.'

## దక్షిణేశ్వరమున శ్రీరామకృష్ణ 'మ.' ల సంభాషణము

(గత సంచిక తరువాయి)

ఆనాటిరాత్రి శ్రీ రామకృష్ణగురుదేవుడు 'మ.' తో మఱల మాటాడుచుండెను. అప్పుడు రాఖాల్, లాటు, హరీష్ మున్నగువారు సయితమచటనే యుండిరి.

శ్రీరామ:— ('మ.' తో) కొందఱు శ్రీ కృష్ణలీలను ఆధ్యాత్మిక వ్యాఖ్యాన మొనర్తురు. నీ వేమనియెదవు?

'మ.':— ఎన్నియోవిధములగు అభిప్రాయములున్నవి. అట్లున్ననేమి? మీరు భీష్మదేవునివిషయము నాకు జెప్పియుంటిరి అంపశయ్యయందుండి దేహపతనము కానున్న సమయమున ఆ మహామహు డిట్లు వచించియున్నాడు: 'నేనేల యేడ్చుచుంటినో తెలియునా? బాధవలనగాదు. సాక్షాత్ శ్రీమన్నారాయణుడే పార్థుని రథమున నిలిచి సారథ్య మొనరించుచున్నను ఆ పాండవుల కడగండ్లకు మేరలేకయున్నదిగదా! ఈ భగవల్లీలను నే నింకను గుర్తింపజాలకుంటిని గదా యనియే నా దుఃఖము.'

మరియు హనుమంతుని విషయముగూడ మీరు చెప్పియున్నారు. 'నేను తిథి వార నక్షత్రము లేమియు నెఱుగను. ఎల్లప్పుడు రామనామ చింతనమే చేయుచుందును.' అని ఆ భక్తాగ్రేసరుడు వచించియున్నాడు గదా!

మరియు ప్రపంచమునందలి సమస్త వస్తువులయందును బ్రహ్మము, శక్తి—ఈ రెండే సద్వస్తువులనియు బ్రహ్మజ్ఞానలాభానంతరము ఆ మహాపురుషు డీ రెండును అద్వితీయైకవస్తువుగా నెఱుంగుననియు మీరు బోధించియుంటిరి. ఆ ఏకవస్తువునకు రెండనది లేదు.

శ్రీరామ:—ఔను నిజమే. వస్తులాభమే నీ యుద్దేశము. వస్తులాభము కోరినచో ముండ్లపొదలద్వారా పోయినను సరియే రాజమార్గమున బోయినను సరియే. (అది నీకు లభింపగలదు.)

ఎన్నియో మతములున్నవన్నమాటనిజమే. తోతాపురి యిట్లు చెప్పుచుండెడివారు: 'మతముల భిన్నత్వమువలన సాధుసేవయు స్తంభించిపోయినది. ఒక గ్రామమున పెద్ద విందు జరిగినది, వివిధ సంప్రదాయస్థులగు సాధువులందరును ఆ విందునకు వచ్చిరి. అందరును 'మాకే మొదట బంతిభోజనము పెట్టవలయును. ఇతర సంప్రదాయస్థులకు తర్వాత వడ్డింపవలయును' అని పట్టుపట్టిరి. ఈ వాదు

లాటకు అంతము లేకపోయినది. ఎట్టి నిశ్చయమునకు రాలేకపోయిరి. చివరికి అందరును వెళ్లిపోయిరి. ఆ వంటనంతయు వేశ్యలు భుజించిరి.'

'మ.':—తోతాపురి మహానుభావుడు.

శ్రీరామ:—కాని హజ్రా 'అబ్బే' అనుచుండును. (అనగా ఆయన సాధారణమానవుడే యన్న సూచన) ఈ విషయములందు వాదన వలన ప్రయోజనముండబోదు. అందరును తమ గడియారమే చక్కగా నడచుచున్నదను కొందురు.

చూచితివా? నారాయణశాస్త్రి కెంతటి వైరాగ్యము పొడమినది? అంతటి మహా పండితుడు భార్యనుగూడ త్యజించి హఠాత్తుగా నిరుద్దేశుడై ఎచటికో వెడలిపోయెను. ఆయన మనస్సున ఉన్నట్లుండి ఒక్కమారుగా 'కామత్యాగము' కలిగినది. అట్లు త్యాగమొనర్చిన యోగము లభించును. కొందరియందు యోగుల లక్షణములు కనిపించును.

షట్చక్రములగూర్చి నీకు జెప్పవలయు నవసరము గలదు. యోగులు షట్చక్రముల భేదించి భగవానుని కృపవలన ఆయన దర్శనమును బొందుదురు. షట్చక్రముల విషయమెపుడైనను వినియున్నావా?

'మ.':—వేదాంతమతమునందలి సప్త భూములే (planes) యవి.

శ్రీరామ:—వేదాంతమునగాదు, వేదమతమున. షట్చక్రములన్న నెట్టివో తెలియునా? సూక్ష్మదేహమున అన్ని పద్మములును నున్నవి. యోగులు వీనినన్నింటిని జూడగలరు. మైనపు చెట్లు, అందలి ఫలపర్ణములవంటివి అవి.

'మ.':—ఔనండి, యోగులు వానిని జూడగలరు. విచిత్రమయిన అద్దము ఒకటి కలదనియు దానిమూలమున సూక్ష్మవస్తువులు పెద్దవిగ గనుపించుననియు నేను జదివి యున్నాను. ఆవిధముగనే యోగశక్తివలన ఆ సూక్ష్మపద్మములనుగూడ జూడవచ్చును.

శ్రీ రామకృష్ణ గురుదేవుడు ఆ రాత్రి 'మ.' ను పంచవటి దగ్గరి గదియందుండ గోరెను. 'మ.' యును ఆరాత్రి అచటనే గడిపెను. వేగుజామున లేచి తనలో తా నొక పాట పాడుకొనుచుండెను, భావము: ఓ దేవా! నేను సాధనయు భజనయు లేనివాడను. దీనుడను హీనుడను నయిన నన్ను నీ స్పర్శవలన ధన్యునిగానింపుము. అనుదినమును నీ చరణారవిందముల గనుగొన బ్రయత్నించుచున్నాను. ఆహా! అవి నాకు లభింపలేదుగదా! నా ఆశ ఆశగనే నిలిచిపోయినది.........

హఠాత్తుగా 'మ.' కిటికీవైపుచూడగనే శ్రీ రామకృష్ణగురుదేవు డచట నిలుచుకొని యుండుట గోచరించెను. 'నీ స్పర్శవలన నన్ను పవిత్రుని గావింపు' మన్న పలుకు వినుచో ఆయన కనులు చెమ్మగిల్లినవి.

'మ.' మఱియొక పాటపాడ నారంభించెను. నేను కాషాయవస్త్రమును, శంఖ కుండలములను ధరించి యోగిని వేషముతో ఆ నిష్ఠురహారిని గాంచువఱకు దేశదేశములు వెదకుదును.'

శ్రీ రామకృష్ణగురుదేవుడును రాఖాలును గలిసి పచారు చేయుచుండిరి.



21–12–1883
శుక్రవారము.

ఈ యుదయము శ్రీ రామకృష్ణగురుదేవుడు బిల్వవృక్షచ్ఛాయను 'మ.' తో నొంటరిగా నెన్నియో విషయములగూర్చి సంభాషించెను. అదియునుగాక ఆయనకు శ్రీ రామకృష్ణగురుదేవుడు భక్తిసాధనయందుగల రహస్యవిషయములను కామ . కాంచనత్యాగమును, అతని మనస్సే అతనికి గురువగు విషయమును గూర్చియు ఎంతో ముచ్చటించెను.

మధ్యాహ్నభోజనానంతరము శ్రీ రామకృష్ణగురుదేవుడు చక్కని పీతాంబరమును ధరించి, పంచవటిని జేరెను. అచ్చటికి వైష్ణవ సాధువులు కొందరు తమ సంప్రదాయానుసారము కౌపీనధారులై వచ్చియుండిరి. మధ్యాహ్నమున నానక్ సంప్రదాయస్థుడగు సాధువొకడచటికి వచ్చెను. అతడు నిరాకార బ్రహ్మోపాసకుడు. శ్రీ గురుదేవుడు అతనిని జూచి 'సాకార బ్రహ్మమునుగూడ ఉపాసింపుము' అని సెలవిచ్చెను.

శ్రీ రామ:—(సాధువుతో) ఇంకను కొంత లోనికి మునిగి చూడుము. పైపయిన తేలుచున్నచో రత్నములు లభించునా? భగవానుడు నిరాకారుడు సాకారుడు కూడను. సాకారోపాసనగావించిన కొందరలో భక్తి లభించును. ఆ పిమ్మట నిరాకారోపాసన. జాబును జూచి దాని విషయమును గ్రహించిన పిదప దానిని పడవేయునట్టిది యిది. అందు జెప్పినట్లు నడచుకొందుము.



ఉ. కీలెఱుఁగింపఁగాక నిఁకఁ గేవలపాండితి మోక్షసిద్ధికిన్
జాలదు; సాధనల్ వలయు సంగతిదెల్పిన కాక లేఖయే
లీలఁ దదుక్త వస్తుతతి లేఖకుఁజేర్పఁగఁజాలు సాధనల్
తాలిమిఁబూని సద్గురుని దర్శనముం గనవయ్యామిత్రమా!

—శ్రీ శారదాదేవి

# శ్రీ వివేకానంద స్మృతి

(గత సంచిక తరువాయి)

ఒకనాడు మేము సుమారు పండ్రెండు గురము శ్రీవారిచుట్టును గూర్చొంటిమి. శ్రీ వారు పరవశులై తమ్మేమఱచి మాటాడు చుండిరి. ఆకంఠస్వరము స్వన్నగిల్లినది. సంధ్యా కాలము ప్రాపించినది. శ్రీవారి వాక్కు లన్నియు నెందో దూరమునుండి వచ్చుచున్న వనిపించినది. అపుడు మాలో మేము ఒకరి కొకరు సెలవుపుచ్చుకొనకయే ఎవరంతట వారమె వెళ్లిపోయితిమి. అట్టి సమయములలో శ్రీవారి పరిసరమంతయు ఒకే పావిత్ర్యిముతో నిండియుండెడిది.

ఒకనాటి సాయంసమయమున శ్రీ వారు సంభాషించుచుండగా మా అక్కయ్య లగ్గెట్టు సతి ఒక గదియందు జూచెను. ఆ గదియం దొక మహిళ యేడ్చుచుండెను. ఆమె భగ వంతుని 'అస్తి నాస్తి' భావములందు సందియము గల వనిత. నీవేల ఏడ్చుచుంటివని లగ్గెట్టుసతి ఆమెను ప్రశ్నింపగా 'ఈ మహనీయుడు నాకు శాశ్వత జీవనమును నొసగెను. ఆయనయొద్ద నేను వినవలసిన దేదియులేదు.' అని ఆమె బదులు చెప్పెను.

రిడ్జ్‌లీ (Ridgely manor) లో స్వామిజీ యుండగా, హఠాత్తుగా నాస్నేహితురాలొక వనిత నా ఏకైకసోదరుడు మరణావస్థయం దున్నాడని యుత్తరముర్వాసెను. అచటికి నా గమనము అత్యంతావశ్యకమని మాఅక్కయ్య చెప్పగా రెండుగంటలలోపుననే ప్రయాణమై శ్రీస్వాములవారి ఆశీస్సులంది బయలుదేరితిని, నేను సూటిగా లాసేంజలిస్‌కు వెళ్లితిని. అచట నూరిబయట గులాబిమొక్కలతో నిండినతోట మధ్యగల కుటీరమునందు నాసోదరుడు మిక్కిలి జబ్బునబడి కష్టపడుచుండెను. అతని తల వైపున శ్రీ వివేకానందస్వాములవారి చిత్ర పటము పెద్దది ఒకటి యుండెను. పదియేండ్ల పిమ్మట నాతని కలిసికొనుటవలన నొక గంట కాలము అతనితో మాటాడితిని. ఆ పిమ్మట ఆయింటి యజమానురాలు మిసెస్ బ్లాడ్‌జెట్ (Mrs. Blodgett) ను కలిసికొని మా సోదరుని నీరసస్థితిని కష్టస్థితిని దెలిపి యితడు మరణించు నేమోగదా యంటిని. 'ఔ'నని ఆమెయు బలికినది. 'అతడిచట మరణించినచో నీ కెట్టి యభ్యంతరము లేదుగదా' యని ప్రశ్నించితిని. ఆపిమ్మట 'ఆతని తలదగ్గరనున్న పెద్దచిత్రపట మెవరిది?' యని యడిగితిని. అందులకు డెబ్బది యేండ్లుదాటిన ఆమె తిన్నగా నిలుచుకొని మహాగంభీరముగా నిట్లు చెప్పినది: ప్రపంచము నందు భగవానుడు కనిపించుచో ఆతడే ఆ చిత్రపటమునందలి వ్యక్తి.

నేను:— ఆయననుగూర్చి మీ కేమి తెలి యును?

ఆమె:— నేను చికాగోనగరమునందు 1893–వ సంవత్సరమున జరిగిన విశ్వమత మహా సభకు జనియుంటిని. అపు డీ యువకుడు లేచి నిలుచుకొని 'అమెరికాదేశపు సోదర

సోదరీమణులారా!' అనునప్పటికి ఒక్కుమ్మడిగా 7000 సభికులు కరతాళ ధ్వనులుచేయుచు లేచినిలుచుకొని ఆనందించిరి. అది ఏలయనునదియు వారే యెఱుగజాలకపోయిరి. ఇది ముగిసినపిమ్మట వందలకొలది స్త్రీలు బల్లల మీదుగా నడచుకొనుచుపోయి ఆయనను చుట్టుముట్టిరి. అపుడు నేను 'సరే అబ్బాయి, ఇపుడు మాత్రము నీవీ దెబ్బ తప్పించుకొన్నచో నీవు నిజముగా భగవంతుడవే' యని యనుకొంటిని.

నేను:—(మెల్లగా) 'నేను వారిని ఎఱుగుదును.'

ఆమె:—ఆహా! మీరెఱుగుదురా?

నేను:—ఔను ఇపుడే ఆమహామహుని 'స్టోన్ రిడ్జి' అను గ్రామమున వదలివచ్చితిని. మీరేల వారిని పిలువరాదు?

ఆమె:—ఈ నా బీదకుటీరమునకా!

నేను:— అయిననేమి? శ్రీవారు తప్పక వత్తురు.

ఆలాగే మూడువారములలో మా అన్నయ్య పరమపదించెను. ఆఱువారములలో శ్రీవారచటికి వచ్చిరి. కొన్నిమాసములపాటు మేమిరువురమును ఆయింట నథితులమై యుంటిమి. Mrs. Blodgett ఎంతో చమత్కారముగ మాటాడుచు నెల్లరను నవ్వించుచుండెడిది. పురుషులయందలి దౌష్ట్యమును ఆమె వివరించుచుండ, స్త్రీలయందలి దౌష్ట్యమంతకు పదిరెట్లుగ వివరించుచు శ్రీవారు సంభాషించెడివారు. ఆమె సాధారణముగా ఎన్నడును శ్రీవారి యుపన్యాసములకు వెళ్లెడిదికాదు; మేమందరమును తిరిగి వచ్చునప్పటికి తగిన ఆహారము వండుటయే తన కర్తవ్యమని పలుకుచుండెడిది. ఒకనాడు శ్రీవారు ఏసుక్రీస్తును గూర్చి మహోత్సాహముతో సంభాషించుచుండగా ఆ సంభాషణ సమస్తమును అపూర్వమగు తేజస్సుతో నిండియుండినట్లు నాకు గోచరించినది. ఆయన ఆభావముతోడనే పరిపూర్ణులైయుందురని తలంచి మరలివచ్చునపుడు శ్రీవారిని నేనేమియు పలుకరింపజాలకపోయితిని. శ్రీవారు హఠాత్తుగా 'ఆ అది ఎట్లు చేయుదురో నే నెఱుగుదు'నని పలికిరి. 'ఏమిటి ఎట్లుచేయుట?' యని నేను ప్రశ్నించితిని. అందులకువారు 'మెళుగుతన్ని' (మిరియపుచారు) ఎట్లుకరివేపాకుచేర్చి చేయుటయో నే నెఱుగుదును' అని నాతో బదులాడిరి. శ్రీవారికి 'తాము' అన్నభావము కొంచెమయినను లేకుండుటయే విశేషత. వారు తనయెదుటనున్నవారి శక్తియు, మహత్త్వమును చక్కగ గ్రహించెడివారు. ఎదుటనున్నవారు శ్రీవారితో సంభాషించుచుండ శ్రీవారినుండి యొకానొక గొప్పశక్తి తమలోజొచ్చి తమకుత్సాహమును కలిగించుట ననుభవించెడివారు. అందువలననే ఎవ్వరైనను నన్ను ఆత్మానుభవమును (దైవికానుభూతిని) గూర్చిన ప్రమాణమును దెలియగోరినచో మహాపురుష సంశ్రయమువలన కలుగుధైర్యమే ఆత్మానుభవమని వచించెడిదానను. శ్రీ స్వామివారు 'అవతారపురుషులెల్లరు తమశిష్యబృందము పాపమును కష్టమును తాము భరించి వారిని స్వేచ్ఛగా ఆనందోపాసనకు వదలివేయుదురు. ఇదియే తారతమ్యము. అవతార పురుషులు పరుల భారమును వహింతురు.' అని వచించిరి.........

1900–వ సంవత్సరమున నేను నాసహోదరి, ఆమెభర్త మిస్టర్ లగ్గెట్టు— అందరమును

పారిస్‌నగరమున నొకయిల్లు అద్దెకు దీసికొని యుంటిమి. శ్రీ స్వామివారు అచట కొన్నాళ్లు మాతో గడిపినపిదప మా చెచ్చెలి జిరాల్డు నోబుల్ యింటికి వెళ్లిరి. ఆ పిదప ఒకనాడు మిస్టర్ నోబుల్‌నుగూర్చి మాటాడుచు 'ఆహా! నోబుల్‌తోడి మైత్రి సంపాదించుకోగలిగినచో ఈ ప్రపంచమునందు జన్మసాఫల్యత గలుగ గలదు. * * *'

1902–వ సంవత్సరమున శ్రీ స్వామివారిని నే నపుడపుడును కలిసికొనుచుండు దానను. బేలూరు మఠమునందు ఒకనాడు శ్రీ స్వామివారు తమ శయనాగారమునందుండ, వారు 'నేను నలువది సంవత్సరములుగూడ నుండ'నని పలికిరి. వారికి అపుడు 39 సంవత్సరములని తెలిసియుండుటవలన 'కాని స్వామిజీ! బుద్ధ భగవానుడు తన మహాకార్యము సమస్తమును 40 మొదలు 80 యేండ్లలోనే నిర్వహించెను.' అని నేను విన్నవించుకొంటిని.

శ్రీస్వామి :—నా సందేశముగూడ ముగిసినది. నేను వెళ్లిపోయెదను.

నేను:—పోవుట లేల?

వారు:—పెద్ద చెట్టునీడ తనయందు చిన్న చెట్లను పెరుగనీయదు. నేను పోయి తీర వలయును. వానికి నేను చోటీయవలయును.

ఆ పిమ్మట నేను హిమాలయములకు బోయితిని. శ్రీవారిని నేను జూడనేలేదు. అటుతరువాత ఐరోపాకు బోయితిని. నేను శ్రీవారి శిష్యురాలనుగాను. చెచ్చెలినిమాత్రమే. నేను వారికి వ్రాసిన తుది జాబునందు 'మునిగినను తేలినను సరియే నాకు మీతోడిదే లోకము' అని వ్రాసియుంటిని. నిజముగా నే నట్లుతలంచు చుంటినా లేక అట్లుచేయ దలంచితినా అని రెండుమూడు పర్యాయము లా వాక్యమును బఠించితిని. అది నా దృఢభావమే. శ్రీవారికి ఆజాబు చేరినను వారికడనుండి ప్రత్యుత్తరము వచ్చినది కాదు. 4 జూలై 1902 న శ్రీవారు పరమపదించిరి.



తే. గీ. అమనస్యకిరీటంబు నట్టితాల్చి, ప్రతి సుఖంబును మానవు పజ్జఁజేరు
నొగి సుఖములకుఁ గైదండ లొసఁగు నరుఁడు, వ్యథల సయితము కౌఁగిట నలమవలయు!

—శ్రీ వివేకానందస్వామి

# ప్రపంచమతములు

శ్రీ నిత్యానందస్వామి

(గతసంచిక తరువాయి)

## క్రైస్తవమతము

పాశ్చాత్యశకారంభమునకు కారణభూతుడైన జీసస్ క్రైస్తు బెతెల్‌హెం అను పట్టణమున మేరీ కన్యకకు పుత్రుడై జన్మించెను. భగవత్సామ్రాజ్య సందేశమును ప్రచారము చేయుటకు ఆదేశింపబడిన మహనీయుడీతడని బాల్యముననే బుద్ధిమంతులు గుర్తించిరి. జీసస్ క్రైస్తుయొక్క కీర్తి దశదిశల వ్యాపింప, జెరూసెలం, జూడియ, జోర్డాన్, డెకాప్లిస్, గాలలీ దేశములనుండి గుంపులు గుంపులుగ వేలకొలది ప్రజలువచ్చి, క్రీస్తు శిష్యులైరి.

జీసస్‌క్రైస్తు - శిష్యులు

ఈ సమూహములను చూచినంతనే క్రీస్తు పర్వతము నధిరోహించెను. ప్రజలును వెన్నంటిరి. అప్పుడు ఈ క్రింది విధముగ శిష్యులకాతడు ప్రబోధించెను.

ధర్మముకొఱకు తపించువారే ధన్యులు—వారే న్యాయమును బడయుదురు.

నిర్మలహృదయులే ధన్యులు—వారే భగవానుని దర్శింతురు.

దయాళువులే ధన్యులు— వారే అనుగ్రహింపబడెదరు.

నిరహంకారులే ధన్యులు—వారే భూలోకమునకు వారసులు.

దుఃఖితులే ధన్యులు—వారే సుఖింతురు.

దీనులే ధన్యులు—వారిదే స్వర్గధామము.

శాంతిదూతలే ధన్యులు— వారే భగవానుని బిడ్డలు.

కష్టపరంపరలతోను, దుఃఖభారముతోను కృశించు మానవులారా, మీరందరు నాదగ్గరకు రండు. మీసేద దీర్చెదను.

ఇహలోక జీవనమునకై నేనిచ్చురొట్టె (ఆహారము) నా మాంసమే. ఇదిగో నాశరీరము. మీకొరకు సమర్పింపబడుచున్నది. దీనిని భుజింపుడు. నా జ్ఞాపకార్థము ఇక్కార్యమును జేయుడు. నా మాంసమును భుజించి, నా రక్తము పానముచేసినవాడు నాయందుండును. నేను వానియందుందును. మిమ్ములగూర్చి నేనిప్పుడు చెప్పిన వాక్యములే శక్తియు, జీవనమును.

(ఇమిటేషన్ ఆఫ్‌క్రైస్తు - అను గ్రంథమునుండి సంగృహీతము)

క్రీస్తు - శిష్యులతో కలిసి ప్రార్థన

స్వర్గధామముననుండు తండ్రీ! నీ పేరు చిరస్థాయియై వెలయుగాక! నీ సత్యరాజ్యము అవతరించు గాక!

స్వర్గమందెట్లో, అట్లే నీ యాజ్ఞలు భూలోక మందును పరిపాలింపబడును గాత! మా దైనందినాహారమును ఈ రోజు మాకిమ్ము. మాకు అపకారము చేసినవారలను మేము క్షమించునట్లు మా ఋణములను నీవు క్షమింపుము. మనో వికారములకు అనగా – మాయకు, మోహమునకు గురికాకుండునట్లు చేసి, పాపమునుండి మమ్ము ముక్తులను జేయుము.

నీదేకదా ఈ రాజ్యము. ఈ యధికారము కూడ నీదే కదా?

కీర్తియు నిరతము నీయదియే. తథాస్తు.

(సెయింట్ మాథ్యూ నుండి)

# ఇస్లాం మతము

అరేబియా దేశస్థుడును, ఘనమత ప్రవర్తకుడునైన మహమ్మద్ - అరేబియా దేశీయ దేవతాగణ శ్రేష్ఠుడును, తదధిపతియును, మహోన్నతుడును, అయిన అల్లానుతప్ప తక్కిన దేవతలందరిని పరిహరించి, సర్వజనాదరణీయమును, సనాతనమును అయిన ఆఅల్లా పేరుననే ఏకైకత్వమును, ప్రభుత్వమును, విశ్వజీవితమును స్థాపించెను.

ఈ ప్రవర్తకమతమునకు ఇస్లాం అని పేరు. ఇస్లాం అనగా శాంతియు, భగవదిచ్ఛకే సర్వము సమర్పించుట అని యర్థము. మహమ్మదుకు భావసమాధి కాలములలో అనగా దైవావేశ సమయములలో లభించిన వాక్యములే ఇస్లాంమత గ్రంథమైన కొరాన్‌లో సమకూర్చబడినవి. హీరా పర్వత గుహయందు దేవత మహమ్మదును చదువమని ఆజ్ఞాపించెను. చదువురాదని మహమ్మదు చెప్పినను, నిర్బంధించి చదివించెను. ఈ కారణము చేతనే ఇస్లాంమత గ్రంథమునకు అల్-ఖుర్ ఆన్ = చదువబడినది అని పేరుపెట్టని సార్థక నామము కలిగెను కదా?

సాయంసమయము ప్రార్థనకు మా పిలుపు :—

అల్లా-హో-అక్బర్! అల్లా-హో-అక్బర్! మసీదులనుండియు, మందిరములనుండి మోయిజినులు పిల్చుచున్నారు. ఓ ఇస్లాం మతావలంబులారా! ప్రార్థనలు చేయుడు. చీకట్లు వడివడిగా క్రమ్ముచున్నవి. అల్లా-హో-అక్బర్! అల్లా-హో-అక్బర్!

అల్లా! అల్లాతప్ప ఇతర భగవంతుడే లేడు. అల్లాయే ప్రత్యక్షదైవము. స్వయంజ్యోతి. ఆయనకు నిద్రలేదు. అలసటలేదు. భూలోకమునగాని, స్వర్గలోకమునగాని ఉండునదంతయు ఆయనదే. అల్లాకోరిననేతప్ప, ఇతరుడెవ్వడును అల్లాకును మానవులకును మధ్యవర్తిగనుండడు. మానవులకు పూర్వాపరములు ఏమికావలసినదియు అల్లాకు తెలియును. అల్లాకు అత్యంత తేజోమయసింహాసనముగలదు. దానిని భరించుటకుగాను అల్లాకు ధ్యానమవసరము. అల్లా సర్వశక్తి సంపన్నుడు. నీవు పుచ్చుకొనుదానికంటె ఎక్కువగా ఇమ్ము. నీ కెవ్వరైన సలాముచేసినపుడు, ఎక్కువ ప్రేమపూర్వక

ముగా 'శాంతికలుగుగాత' అని సూచించుచు ప్రతి సలామును జేయుము. మఱియు ఇట్లు చెప్పుము. స్వర్గలోకమందలి అల్లానుండి శాంతియు, ప్రేమయును నీకు లభించుగాత! సహోదరభావముతోగూడిన ప్రతిపదమును అల్లాకు వినబడును. నీవు నీసహోదరునికి ఎక్కువ ప్రేమపూర్వకముగ ఇచ్చినది వ్యర్థముగాదు.

(సర్ ఎడ్విన్ ఆర్నాల్డుయొక్క ఇస్లామ్ రోజరీ నుండి సంగృహీతము.)

ప్రపంచమునకు శిక్షణనిచ్చి మతసహన, శాంతిమార్గముల మానవుని నడచునట్లు చేయుటే మతముయొక్క ఆశయము. సృష్టి అంతయు అతి దూరమందలి యేదివ్య లక్ష్యమునుద్దేశించి, పురోగామియగుచున్నదో, అట్టి విశ్వమానవ సౌభ్రాతృత్వ కళ్యాణములకు దోహదముగ ప్రతి మతమును, తన పేరుప్రతిష్ఠలు నిల్చునట్లు యథాశక్తి తోడ్పడవలయును. హిందూ దేశమునందు నానావిధ మతములు స్నేహ, సద్భావములతో చేరియున్నవి. వివిధమతావలంబులగు భారతమాత పుత్రులు తమ జననికి ప్రేమ పూర్వకముగ సమర్పించు భక్తిగీతము నాలకింపుడు.

మాతా! మేల్కొనుము. నిన్ను భక్తితో పూజించి, నీ సేవ జేయుటకు నీ సన్నిధానమునకువచ్చి మోకరించి, నీ బిడ్డలు వేడుకొనుచున్నారు. రాత్రి అంతమగుచున్నది. ప్రభాతరేఖలు పొడసూపుచున్నవి. జననీ! లెమ్ము. మేల్కొనుము. మమ్ముల బంధించిన దుఃఖముల నెడబాపుము. మమ్ముల నాహ్వానించుము.

ఓ ప్రియజననీ! భవదీయ వివిధశక్తి సామర్థ్యములను, నీ అభిమానమును, వారసత్వముగ పొందుటకు మేము నీ బిడ్డలముగామా? ఎవ్వరి హృదయములు నీ నివాసస్థానములును, రక్షణస్థానములును, పీఠములును అయియున్నవో, అట్టి నీ పుత్రులమగు మేము నిన్ను మఱువము, విడువము; తప్పటడుగులు వేయము. ఇదిగో! తారలను గ్రహములను ఆకసముతోడ కంపింపజేసెదము. అత్యున్నత కీర్తిపదమున నిన్ను పునః ప్రతిష్ఠ చేసెదము.

హిందువులు:— తల్లీ! మా పుష్పములు నీకు సామ్రాజ్యాభిషేకము చేసినవి.

పార్శీలు:—మాతా! మా ఆశాజ్యోతి నిన్నానరించుచున్నది.

ముసల్మానులు:— జననీ! మా ప్రేమఖడ్గము నిన్ను సంరక్షించుచున్నది.

క్రైస్తవులు:— అంబా! మా విశ్వాసగీతము నీ పరిచర్య చేయుచున్నది.

అందరు:—— ఓ మహారాజ్ఞీ! మానిశ్చలభక్తి నీకు ప్రయోజనకారికాదా! ఓ దేవి! ఆలకింపుము. ముక్తకంఠమున మేము జోహారులొనర్చుచున్నాము.

జయ! భారతమాతకుజై!
జయ! గీతా మాతకుజై!
జయ! హింద్! జయ!

ఓం తత్సత్

(కవయిత్రి:——శ్రీమతి సరోజనీ నాయుడు, భారత దేశ కవికోకిలము.)

# హిందూమతము

## శ్రీ కృష్ణార్జునులు

వివిధమతములయొక్క సమాయే హిందూమతము.

ఈ మతము ఎప్పుడు, ఏ సందర్భమున, ఎట్లు పుట్టినది ఎవ్వరును చెప్పజాలరు. హిందువులు తమ మతము అనాదియనియు, సనాతనమనియు, జ్ఞానమునకు, ప్రేమమునకు, నిధానమనియు, సర్వులకు శరణ్యమనియు విశ్వసింతురు.

ఉపనిషత్తులు, భగవద్గీతాశాస్త్రము, బ్రహ్మసూత్రములు, హిందూమతమునకు మూలగ్రంథములు. దర్శనములు భిన్నముగనుండినను మతసార మొక్కటియే. యథార్థ జ్ఞానహీనులు మతముపేర పరస్పరము ద్వేషపూరితులై కలహింతురు. బుద్ధిమంతులన్ననో తమకు నచ్చిన మతము నవలంబించుచు, ఇతర మతములన్నింటిని సమాదరింతురు. విశ్వమత తత్త్వమునుగూర్చి విచారింతము. ప్రపంచ మానవ చరిత్రలో వివిధకాలములందు పలు తెఱగుల ధర్మమును విశదపఱచిన మత తత్త్వములు గలవు. కురుక్షేత్ర రణరంగమున హైందవభావ, జీవనములమూలసిద్ధాంతముల గూర్చి వీరశేఖరుడైన అర్జునునకు శ్రీ భగవానుడేమి బోధించుచుండెనో వినుడు. ఆత్మకు పుట్టుక లేదు; నాశములేదు. ఆత్మ లేనికాలమే లేదు. ఆత్మ భూత, భవిష్యద్వర్తమానములను త్రికాలములందును ఉండునదియే. ఆద్యంతములు స్వప్నతుల్యములు. ఆత్మ–అజము, అనురము; నిత్యము, పరిణామరహితము. ఆత్మగేహము (దేహము) మృతముగతోచుచుండినను, ఆత్మను మృత్యువు దరియలేదు. స్వార్థచింతవీడి, విహితకర్మానుష్ఠానముద్వారా, అనగా స్వధర్మాచరణమున నిరంతర లోకసేవయే ఆత్మోపలబ్ధికి మార్గము. కర్మమును ఆరాధనముగ దైవసేవగ మార్పుము. కర్మబంధమునుండి విముక్తుడయ్యెదవు. దైవారాధనమునకు నిర్ణీత విధానములేదు. ఎవ్వని భక్తి విధాన మెట్టిమార్గమును బట్టినను, భగవత్సాక్షాత్కారమే అవధిగలదియగును. భక్తి శ్రద్ధలుండిన చాలును. అన్ని మార్గములును భగవంతుని జేర్చునవే కదా? యుగయుగమునందును ఈధర్మమును సంస్థాపించుటకొఱకును, దుష్టశిక్షణముచేసి, శిష్టులను రక్షించుటకొఱకును మానవసంఘమున నేను (భగవానుడు) అవతారముల గ్రహించుచుందును. నీ సర్వస్వమును నాకు అర్పణముచేసి, నన్నే శరణుపొందుము. సర్వపాపములనుండి నిన్ను విముక్తుని జేసి రక్షించెదను. అని కట్టకడపట ప్రతిజ్ఞాపూర్వకముగ శ్రీ కృష్ణభగవానుడు సెలవిచ్చెను



# రాణి రాస్మణి దేవి

శ్రీ దువ్వూరి రామకృష్ణారావు, బి. ఏ.

(గతసంచిక తరువాయి)

శ్రీ రామకృష్ణులా యుత్సవ దినమంతయు నానందముగ దక్షిణేశ్వర దేవాలయమున గడపుచున్నను, దేవాలయమున భోజనమును జేయక మూడుదమ్మిడీల పేలాలనుమాత్రము కొని వానిని భుజియించి సాయంకాలము ఝూన్ ఫకూర్ పాఠశాలకు తిరిగివచ్చెను. రామ కుమారుడు పాఠశాలకు రాక దక్షిణేశ్వరమున నాగిపోవుటచే శ్రీ రామకృష్ణుల మన స్సాందోళన జెందెను. జరిగిన సంగతిని దెలిసికొనిన వారై, తమ ఛటర్జీ వంశ మర్యాదలకును, గుటుంబ మర్యాదలకును భిన్నముగ, శూద్రుల వలన బరిగ్రహణము, నందు ముఖ్యముగా ఆ యుద్యోగమువలన రామకుమారుడు వంశ మునకు గళంకము తెచ్చుచున్నాడని, రామ కృష్ణు లన్నగారికి నచ్చజెప్పబోయిరి. కాని రామకుమారుడు తన పట్టుదలను వదలక, తన నడవడిక శాస్త్రసమ్మతమైనదని శాస్త్రచర్చను శ్రీ రామకృష్ణులతో జరిపెను. చివరకు దప్పొప్పుల నిర్ణయమునకై సోదరు లిద్దరు చీట్లను వేసికొనిరి. రామకుమారుని చీటి గెలుపొందెను. ఈ తుది నిర్ణయమున కంగీకరించినను, శ్రీ రామకృష్ణులు దేవాలయ ప్రసాదమును స్వీకరింపరయ్యె. అంత చివరకు రామకుమారుడు దేవాలయ 'ఖార్గిరి' నుండి బియ్యము, కూరగాయలను స్వీకరించి గంగయొడ్డున స్వయంపాకము జేసికొనుమని రామకృష్ణులను గోరెను. దీనికి రామకృష్ణు లంగీకరించిరి. అంతటినుండి, గొంతకాలము వరకు రామకృష్ణులు దక్షిణేశ్వరమున, దన తీర్థ ప్రసాదములనే, తాను పుచ్చుకొనుచుండెను. ఆ యేకాంత పవిత్ర వాతావరణము, అన్నగారి ప్రేమ, రాణిరాస్మణి, మథురబాబులకు తనయందు గల గౌరవప్రపత్తి, అచ్చట ఆ విశ్వేశ్వరి దర్శనము, ఇవి అతని మనము నాకర్షించెను. ఇంతేకాక ఆ పవిత్ర గంగా జలమునందలి నీకెంత భక్తివిశ్వాసము లన, గంగోదకము నారాయణస్వరూప మనియు, నచ్చట నివాస మెంతటి నిరీశ్వరవాదికైన నాధ్యాత్మిక సంపదను గలుగజేయు ననియు, నా గంగానదీ జలబిందువు లొక యామడ దూరమువరకు ప్రసరించుననియు, నా స్థలమునందున్న సర్వము బవిత్రమే యనియు, శ్రీ రామకృష్ణులు జెప్పువారు. కాన గంగానదీ పవిత్ర జలమునుగూర్చి రామకుమారుడు చెప్పగనే రామకృష్ణులు భోజనమును గురించిన ఛాందసము సడలెను. శ్రీ రామకృష్ణుల నియమ నిష్ఠలు తన కుల, గోత్ర శాస్త్రానుసారముగు నాచారమై యుండినను, శ్రీ రామకృష్ణులలో జ్ఞానము వికసించిన కొలదియు, వారి దివ్యదృష్టి వ్యాపించిన కొలదియు, దేవి

యెడల శ్రీ రామకృష్ణుల భక్తి యధికమై, యిట్టి యాహారము నిజముగా పవిత్రమైన దివ్య ప్రసాదమని సంతోషపూర్వకముగ నా యన్నమును భుజింప నారంభించిరి. కాబట్టి శ్రీవారి జీవితచరిత్రయందు మన కిట్టి చిన్న విషయములు ఆదర్శ గుణపాఠములు గలవియైనవి.

నిరాడంబర జీవియు, వినయమూర్తియు, బీదబ్రాహ్మణ బాలుడు నగు నా సుందర గాత్రుని, సాధుస్వభావుని, భావపూరితమా చిరునగవును, మృదుమధురస్వనమును, విశేష భక్తియును గల నా దివ్యోన్మత్తుడగు శ్రీ రామకృష్ణుల దక్షిణేశ్వర జీవితము మథుర బాబునకు విదితమై యాతని నాకర్షింప జొచ్చెను. దక్షిణేశ్వరమున శ్రీ రామకృష్ణులు శివప్రతిమ నొకదానిని మట్టితో జీవకళ లొలుకు నట్లుగ తయారుజేసికొని, యద్దాని నారాధించుచు, తన్మయుడై ధ్యానము జేయుచుండుట మొదలగు విశేషములను మథురబాబు చూచి శ్రీ రామకృష్ణులను కాళీ దేవాలయమునం దర్చకునిగ నియమింప నిశ్చయించుకొనెను. కాని శ్రీ రామకృష్ణులు ప్రాపంచిక సంబంధములయెడ విరాగియై, తా నొంటరిగ నెవరికిని దెలియకుండ మాతయొక్క సాక్షాత్కారమునకై ధ్యానము సేయుచుండెను.

ఇంతలో సిహోరిగ్రామ వాస్తవ్యుడును, శ్రీ రామకృష్ణులకు సాధనకాలమున ముఖ్యుడై యండగ నుండినవాడును, ఆతనికి ప్రియుడును, తండ్రియగు ఖుదీరాం చెల్లెలికుమార్తెయగు హేమాంగినికి పుత్రుడునగు హృదయరాముడు పొట్టగడువక చివరకు దక్షిణేశ్వరమున రామ్‌కుమార్, రామకృష్ణుల యండ జేరెను. హృదయుడు శ్రీ రామకృష్ణులను గంటికి రెప్పవలె కాపాడుచుండెను. శ్రీ రామకృష్ణులు దేవీ సాక్షాత్కారమునకై, నపారమగు భక్తి విశ్వాసములతో ధనార్జనయందు, శరీర సౌఖ్యమునందు లక్ష్యముమాని గాఢతపస్సును జేయుచుండెను. ఇట్టి శ్రీ రామకృష్ణులను రామకుమారుడు గాని, మథురబాబు గాని దేవాలయమునం దేపనికిని నియమింపజాల రైరి.

సందర్భము లిట్లుండ కృష్ణాష్టమీ ఉత్సవము జరిగిన మరునాడు రాధాగోవిందుల విగ్రహములను బవ్వళింపుసేవకై యా దేవాలయపు పూజారియగు క్షేత్రనాథుడు గుడినుండి ప్రక్కగదికి గొనిపోవుచుండ యా పాలగచ్చుపై జారిపడుటచే కృష్ణవిగ్రహము కాలు విరిగెను. అంత పండితులా విగ్రహ మారాధనకు పనికి రాదని నిశ్చయించిరి. క్షేత్రనాథు డర్చకుడుగా తగడని నిశ్చయింపబడినది. మరియొక విగ్రహమునుగూడ ఆయత్తపరచిరి. ఈ దేవతాపచారమునకై మనోసంకటముతో జింతిలుచున్న రాస్మణిదేవి హృదయము సంతసిల్లునటుల, శ్రీ రామకృష్ణులా విగ్రహమారాధనకు పనికి వచ్చుననియు, రాణి యల్లునికి గాలువిరిగిన మాత్రాన, అల్లు నామె విసర్జించునా యనియు జెప్పుటయే గాక, ఆ విగ్రహము నతుకు తెలియనంతటి చతురతతో బాగుచేసి, మథుర బాబుతో దాను పరవశులై యున్నప్పు డా నూతనవిగ్రహము సరిగాలేదని చెప్పెను. ఇంతయే కాక (హృదయుని కోర్కెపై) హృదయుడా దేవతావిగ్రహముల కలంకారాదికముల చేయుట, దేవతా సంబంధమైన యాభరణముల పూచీ నాత డంగీకరించుట కొప్పుకొనినందున, శ్రీ రామకృష్ణులు ఆ రాధాకాంతుల పూజలు సేయుట కొప్పుకొనిరి. అతి సంతోషముతో మథురబాబు, రాణి రాస్మణియు శ్రీ రామ

కృష్ణులను రాధాకృష్ణుల కర్చకునిగ క్షేత్ర నాథుని స్థానమున నియమించిరి.

కాళీపూజలకుగూడ సర్వసమర్థులుగ నుండుటకై రామకుమారులు తాంత్రికములందు నిపుణులగు కేనారాం భట్టాచార్యులచే రామకృష్ణులకు శక్తిపూజ నుపదేశింపజేసెను. ఆ మంత్రదీక్ష చెవినిబడగనే, శ్రీ రామకృష్ణులు తన్మయులై ధ్యాననిమగ్నులైరి. ఈ పరిణామము కాళికాదేవి ప్రతిష్ఠ జరిగిన కొలది మాసములకే జరిగెను. అప్పుడప్పుడు రాధాగోవిందుల పూజ రామకుమారు డొనర్చుచు, శ్రీ రామకృష్ణులను కాళీపూజ చేయుమనుచుండెను. ఇట్లొక సంవత్సరము గడచులోపల రామకుమారు డస్వస్థతగ నుండుటయు, రాధాగోవిందుల పూజ హృదయు డొనర్చుచుండుటయు, నంతలో మథురబాబు శ్రీ రామకృష్ణులు చేయు ఆ దేవీపూజకు అంబ ఆ విగ్రహమున బ్రత్యక్షమగునని రామకృష్ణులతో బలుకుటయు, రామకుమారుడు స్వర్గస్థు డగుటయు జరిగి, శ్రీ రామకృష్ణులకు కాళికాదేవాలయమున భవతారణి అర్చకత్వము దప్పనిసరియై స్థిరమైనది. ఇట్లు కాళికాదేవి శ్రీ రామకృష్ణుల కిష్టదేవత యయ్యెను.

అప్పటినుండియు దన ఇష్టదేవతయగు భవతారణి మృణ్మయస్వరూప గాక చిన్మయ యనియు, నా దివ్యసుందర రూపమునందు చైతన్యశక్తి ఆవహించి యున్నందున, ఆ ప్రతిమయందు జగజ్జనని ప్రత్యక్షమగుననియు దృఢవిశ్వాసముతో దాని సత్యమును గనుగొనుటకై ప్రాపంచికస్మృతి లేక దక్షిణేశ్వరమున ఘోరతపస్సు చేయుచు, ఆ యంబకు బూజాపునస్కారము లొనర్చుచు, ఆ దేవి తనతో బ్రత్యక్షముగ, ముఖాముఖిగ, మాట్లాడుచున్నట్లు, అచ్చట మానవాకృతితో జరించుచున్నట్లు, ఆమె తన తల్లియే యనియు జిరునగవొలుకుచు ఆమె తనకు మంచినే సమకూర్చుచుండు రక్ష, భద్ర యని తలంచుచు, గీర్తనలు పాడుచు, భజనల సేయుచు, ఏకాగ్రతతో ఆరాధనల సల్పుచు, భక్తిమార్గముల నామె గొల్చుచు, రకరకములగు సాధనల యందు తరించుచు, దివ్యోన్మత్తులై శ్రీ రామకృష్ణులు విహరించుచుండిరి.

ఇట్లు శాస్త్రసమ్మతమై, ఆగమాది విధివిహితముగ, ఇతరులకు దుర్గమమైన, ఆధ్యాత్మికసోపాన సాధనముల విహరించుచు, ఆయా సాధనల సత్యముల నవగతము జేసికొనుచుండు శ్రీ రామకృష్ణులకా కాళికా విగ్రహమునకు, అనన్యత్వభావ మేర్పడి, తనయందలి యా ప్రతిమయందలి చైతన్యశక్తి యొక్కటియే యని, యభేదమని, ఆ మూర్తియే తాను, దానే యామూర్తి యను ఏకత్వాభ్యాసమున నున్మత్తావస్థయం దుండిన శ్రీ రామకృష్ణుల పూజాదికము, లాచరణలు చూపరులకు నింద్యములు, నపరాధములు, దప్పులుగ బొడచూప, శ్రీ రామకృష్ణులు పిచ్చివారని మథురబాబునకు వారు తెలియజెప్పిరి.

అంత మథురబా బొకనాడు శ్రీ రామకృష్ణులను గనిపెట్టుటకు రాగా, శ్రీ రామకృష్ణులు తన్మయులై, పూజానిమగ్నులై యుండుటను గాంచి, యెవరినీ రామకృష్ణులతో గలుగజేసికొనవద్దని చెప్పెను. నాటి నుండి వారియందు మథురబాబునకు శ్రద్ధాభక్తు లినుమడించెను. మరియొకనాడు రాస్మణి దక్షిణేశ్వరము వచ్చి గంగలో స్నానముచేసి, యంబదర్శనము జేసికొని, యచ్చట గూర్చొని తన యలవాటు ప్రకారము శ్రీ రామకృష్ణు

లను భక్తికీర్తనలను పాడుమని కోరెను. శ్రీ రామకృష్ణులు మధురగానలోలురై, ఆ గుడి యంతయు నానందమయమై వెలయ, రాస్మణి పరధ్యానముగ నుండుటను గాంచి, "ఆ వ్యాకుల మిచ్చటగూడనా" యని కేక వేయుచు రెండు లెంపకాయ లామె దవడపై పెట్టెను. దేవాలయ సేవకులా యుదంతమును గాంచి నివ్వెరపొందిరే కాని, దోషిని శిక్షింపజాలరైరి. కాని యా సమయమున శాంతముగనున్నది రాణియు, శ్రీ రామకృష్ణులును. అవివేకియగు తనబిడ్డను మందలించు తండ్రిబోలి గురుదేవులును, ఏదిగో యల్లరిజేయుచుండ పట్టువడి, సిగ్గుపడుచుండునట్లు రాస్మణియు గన్పట్టిరి. భక్తిగానలోల గాక, అప్పుడు నడచుచున్న వ్యాజ్యపు గొడవతో దన మనసు కలవరపడుచున్న విషయమును పరేంగితజ్ఞాన శక్తిని గ్రహించిన యా యిరువది సంవత్సరముల ప్రాయముగల పిన్నవయస్కుడగు నర్చకుని ధీవిశేషమునకు, ఏబదియైదు సంవత్సరములు గడచి, పెద్ద లెక్కగనున్న, ఆ రాస్మణిదేవి లోలోన మెచ్చుకొని, శ్రీ రామకృష్ణులకు జరిగిన విషయమును దెలియచేయవలదనియు, వారి జోక్యమునకు బోరాదనియు, సేవకులతో చెప్పెను. రాణి తనగదిలో విశ్రమించియుండ, ఈ విషయమును బ్రస్తావింప, రాణి "మీ కా విషయ మవగాహనముగాదు. ఆ దివ్య మాతయే నన్ను శిక్షించి, నా హృదయవికాసము గావించిన" దనిమె. ఈసందర్భమునుజూడ, శ్రీ రామకృష్ణులు జగన్మాతచేతిలోని యుపకరణముగను, రాస్మణిదేవి తన పరధ్యానమునకు దగిన శిక్షగా గుర్తించి, దానిని ఒప్పుకొని యానందించు వ్యక్తిగను వీ రుభయుల యాధ్యాత్మికస్వభావములువ్యక్తములగుచున్నవి.

ఎంత దివ్యోన్మత్తుడు శ్రీ రామకృష్ణులని రాణియు, మధురబాబును తలంచుచున్నను, వీ రుభయులు ప్రపంచధోరణిక, ప్రజల మాటలకులోనై, రామకృష్ణులకు నాడీదౌర్బల్య మేర్పడెనని యపోహపడి, యొక సుప్రసిద్ధ కలకత్తా వైద్యునిచే రామకృష్ణులకు జికిత్స చేయించిరి. కాని గుణము గనబడనందున, వీ రిద్దరు శ్రీ రామకృష్ణుల బ్రహ్మచర్యనిష్ఠకు భగ్నముగలిగించినవారి ఆరోగ్యముతిన్నబడునని, కృత్రిమోపాయముల రెండుపర్యాయములు శ్రీ రామకృష్ణులదరికి అతి సుందరులగు సానుల నంపిరి. కాని రామకృష్ణులదరి వారుచేరియు, చేరకపూర్వమే వారల మాతృభావన జేసి, చిన్నపాపనివలె తన యంబ దరిజేరజొచ్చెను. ఇట్లు వారు శ్రీ రామకృష్ణులను మనోవికారము నొందింప విఫలులై, సిగ్గువడి; చేసిన యపరాధమును తెలిసికొనుటయే కాక శ్రీ రామకృష్ణులను గురుదేవు లను భావమునందు నిశ్చయాత్ములైరి.

పరిశుద్ధాత్ములగు రాణి, మధురబాబులకు శ్రీ రామకృష్ణుల చర్యలందు కొన్ని యద్భుత దర్శనములుగూడ పొడసూపినవి. వీ రుభయులకు శ్రీ వారద్వితీయులనియు, లోకాతీతులనియు జ్ఞానము దినదినప్రవర్ధమానమై, శ్రీ వారియందు సునిశ్చలభక్తి, విశ్వాసము లేర్పడినవి. ఇక శ్రీ రామకృష్ణులు పతితులను పావనులజేయుటకై, మానవాకృతిని దమయాచరణయందు భక్తి, జ్ఞాన, వైరాగ్యములాదిగాగల వివిధమార్గములందు చిత్తైకాగ్రతతో సాధనలజేయుచు, వానివాని గమ్యస్థానముల ననుభూతిం గాంచుచు, ఆచార్యులుగనుండుటకు గావలసిన యోగసిద్ధికై నిరంతర యోగాభ్యాసమున గాలము బుచ్చుచు, తమ తపస్సున

కా దేవాలయమునందలి సేవ యవరోధముగ నుండుటచే, హృదయుని తమ స్థానమున కాళికా దేవాలయ పూజారిగ, మథురబాబు నంగీకారముతో నేర్పాటుజేసి, దక్షిణేశ్వరమున దా యథేచ్ఛగ విహరించుచుండుటయు జరుగుచుండెను.

రామకృష్ణదేవులు, భక్తులు, మథురబాబు, రాణి ఆ దేవతావిగ్రహమున కాళికాదేవి ప్రత్యక్షముగ వెలసియున్నదను సంతృప్తి గాంచుచుండిరి. రాస్మణిదేవి కల, మనోవికారముగాక, యథార్థమయ్యెను. ఆ జగజ్జననికి నిత్యనైవేద్య పూజాదికములకు గావలసిన శాశ్వతమగు నేర్పాట్లను రాణి చేయించి, తాను దరచు నా భవతారణి సమ్ముఖమున నద్దేవి నుపాసించుచు గాలము బుచ్చుచుండెను. ఇంతలో శ్రీ రామకృష్ణుల లీలారంగమునకై తగు వసతులను జేకూర్చుటకు జన్మించి, శ్రీ రామకృష్ణుల కృపాకటాక్షమున తన జన్మ సాఫల్యమై, తాను ప్రపంచమున బుట్టిన ప్రయోజనము తీరెనా యనునటుల, రాస్మణి దేవి కొకనాడు హఠాత్తుగ క్రిందబడిన పిదప కడుపునొప్పితో జ్వరము వచ్చెను. ఎందరు వైద్యనిపుణులైనను జబ్బు తగ్గింపలేక పోయిరి. క్రమేపి ఆ జబ్బు రక్తగ్రహణిలో బెట్టి, యతిసారములోనికి దిగినది. మరణమాసన్నమైనదని గ్రహించినదై, రాణి తన పెద్దకొమార్తె యగు పద్మమణిని కాళికాదేవాలయపు సొత్తునందుగల హక్కులను వదలుకొనునట్లుగ బత్రమునందు తన సంతకము జేయుమన ఆమె తిరస్కరించినందున, రాణిమనసు కొంత తపించినది. అంత్యదశయందామెను బవిత్ర గంగాతీరమునందలి కాళీఘాట్ దగ్గరి భవనమునకు మార్చిరి. ప్రాణోత్క్రమణ సమయమున నామెను గంగయొద్దునకు దీసికొనివెళ్లిరి. పరిచారిక లామెయొద్ద దీపములను వెలిగింప, "ఆ దీపములను దీసివేయుడు, దేదీప్యమానమగు నా దేవి తేజస్సు ముందఱ నీ దీపములు వెలవెలబోవుచున్నవి. శతకోటి సూర్యుల ప్రకాశముతో నాతల్లి యీస్థలమునం దంతటను బ్రకాశించుచున్న" దనుచు, మరికొంత సేపటికి, "అమ్మా! వచ్చితివా? పత్రముపై సంతకమును చేయనందున నేమైన హానికలుగునా, అమ్మా!" యనుచు దీనముగ నాశక్తిమాతను స్మరణ చేయుచు, ఎంతయో శాంతముగ 1861-వ సంవత్సరమున ఫిబ్రవరి 19-వ తేదీ రాత్రి ఆమె పరమపదమును జేరెను.

రాణిరాస్మణిదేవి పేరు ప్రఖ్యాతులకుగాని, శిలావిగ్రహములకుగాని ఛాయాపటములకుగాని వాంఛించని నిరాడంబరజీవి; ఆదర్శప్రాయ - పుణ్యవతి-గృహలక్ష్మీ స్వరూపిణి-అన్నపూర్ణేశ్వరి-దాంపత్యమున కనసూయ. అనుచరుల యందు కరుణామయి, క్షుధాతురులకు దానశీల. అందులకే శ్రీ రామకృష్ణులామె "రాణి" పేరునకు దగిన యుదారహృదయ యనెను. తన దక్షిణేశ్వర కాళికా ప్రతిష్ఠ ఖ్యాతిని ఆమె కొసంగెను. రాస్మణి నిజమగు గృహస్థాశ్రమమునందున్న త్యాగిని!



# శ్రీ మాతృదేవికి సోదరి నివేదిత లేఖ

కేంబ్రిడ్జి మాస్,
ఆదివారము, డిసెంబరు 1910.

అమ్మా!

ఈనాడు ఉదయం సారా ఆరోగ్యముకొరకు మొక్కుకొనుదమని చర్చికి వెళ్లితిని. అక్కడ భక్తులందరును జీససు తల్లి మేరీని ధ్యానించుచుండిరి. వెంటనే నీవు జ్ఞాపకమునకు వచ్చితివి. నీ అందమైన ముఖము, ఆ కటాక్షవీక్షణములు, నీవు ధరించు తెల్లని చీర, నీ మురుగులు, అన్నియు జ్ఞాపకమునకు వచ్చినవి. నిర్భాగ్యురాలు, మంచముబట్టిన సారాకు శాంతి కల్గించిరక్షింపకల్గునది నీ దర్శనమే అనిపించినది. నీకు తెలియునో లేదో అమ్మా—ఆనాడు సాయంకాలము శ్రీ రామకృష్ణుల సేవకై బుద్ధిమాలి నీ గదిలో ధ్యానమందు కూర్చుండిపోయితిని గదా! ఒక చిట్టితల్లినై చనువుగా నీ పాదములదగ్గిర ఆడుకొనుచుండిన భాగుండునని ఎందుకు తోపలేదో! అమ్మా! తల్లీ నీ రూపము ప్రేమమయము. నాలోను మా అందరిలోను ఉబుకుచు ఉద్రిక్తముగా కన్పించెడి ప్రేమవంటిదా నీ ప్రేమ—కాదు. శాంతితో సర్వతోభద్రమై ఎవ్వరికిని చెడుపుచేయని ప్రేమ నీది. బంగారమువలె ధగధగ మెరయు నిశ్చల నిష్కపట ప్రేమ నీది. నెలదినముల క్రితమునాటి ఆదివారము—నిన్ను కలిసికొన్న దినము ఎంతటి పర్వదినము. చివరిసారి గంగను దాటిపోవు ముందు వెనకకు తిరిగి పరుగునవచ్చి నీతో గడిపిన ఆ క్షణమే! క్షణము. నన్నాదరించి నీవిచ్చిన దీవనలో అద్భుతమైన ఆనందానుభూతిను పొందకల్గితిని. అమ్మా—నీమీద ఒక పదమో, సంకీర్తనమో కట్టి పంపుదమని ఆశించితిని. ఎందులకీ చాటింపు, అట్టహాసము అనిపించినది. నీవు తప్పక ఆ పరమాత్ముడైన శ్రీ రామకృష్ణుల విశ్వప్రేమాంశ సంభూతురాలవు. ఆ పరమాత్ముడు తన పిల్లలకు అప్పగించిన నీయందు మేము ముగ్ధులము. ప్రచండవాయువు, తీక్షణ సూర్యాతపము, వనసౌందర్యము, జల జల పారు గంగాప్రవాహము అన్నియు పరమాత్ముని అపూర్వశక్తి సంజనితములు. నిత్య జీవితమున బడి వీటిని మనము గ్రహించలేక పోవుచుంటిమి. ఇవియు నీవంటి ముగ్ధస్వభావులే!

అమ్మా! సారాకు నీకరుణావేశమును పంపవూ? అను క్షణము రాగరహితమై ఉత్తాల శిఖరమును అధిష్ఠించి ఉందువు కదా? పరమాత్ముని దివ్యమైన మధురాశీర్వాదము తామరపాకుపై నీటిబొట్టువలె ప్రచలించుచుండును కదా!

అమ్మా—ఇట్లు, నీ పిచ్చిచిట్టితల్లి.
నివేదిత



# శ్రీ వాసుదేవ మననము

## తృతీయ వర్ణకము

శ్రీ మాచిరాజు శ్రీరామకృష్ణ

(గతసంచిక తరువాయి)

గురువు:—వత్సా! ఆ విగ్రహములయందు ఈశ్వరత్వము గలదు. ఆ విగ్రహములయందు ఈశ్వరబుద్ధితో విశేషముగ విత్తమును వ్యయపఱచి అర్చనలు - అర్పణములు - అభిషేకములు - కల్యాణోత్సవాదులు సకల జనులచేతను జరుపబడుచుండుటవలన వానియందు ఈశ్వరత్వము గలదు. ఎవరికి శాస్త్రమునందు విశ్వాసము లేదో అట్టి మ్లేచ్ఛాదులు విగ్రహారాధనయందు ఉదాహరణీయులు కారు. "అసన్నేవ సభవతి అసద్బ్రహ్మేతి. వేదచేత్ । అస్తిబ్రహ్మేతి చేద్వేదసంతమే నంతతో విదురితి ॥" (తై. ఉ. 2-6-1) ఎవ్వడు బ్రహ్మమే లేదని తెలిసికొనునో వాడును లేనివాడే యగును. ఎవ్వడు బ్రహ్మముగలదని తెలిసికొనునో అట్టివానిని బ్రహ్మవేత్తనుగా విద్వాంసులు పరిగ్రహించుచున్నారు. మఱియు ఎవ్వడు బ్రహ్మమే లేదని భావించుచున్నాడో అట్టివాడు బ్రహ్మప్రాప్తికి సాధనభూతమును వర్ణాశ్రమ వ్యవస్థా (శాస్త్రనిరూపితనియమ) రూపమును అగు సన్మార్గమునుగూడ అంగీకరించనివాడగుచున్నాడు. వేదశాస్త్ర సిద్ధాంత నిశ్చితమగు అట్టి వ్యవస్థను అంగీకరించని నాస్తికశిఖామణి లోకమునందు దుర్మార్గుడని ప్రసిద్ధికెక్కును. "నాస్తికో వేద నిందకః" = వేదమును నిందించువాడు నాస్తికుడని మనుస్మృతి 2-11. "వేదేషు ధర్మశాస్త్రేషు ద్వేష్టి యో వై ద్విజాతిషు । దేవేషు పితృధర్మేషు సోఽక్షయ్యం నరకం వ్రజేత్ ॥" (ప. స్మృ.) వేదములయందు ధర్మశాస్త్రములయందు విప్రజాతియందు దేవతలయందు పితృధర్మములయందును ద్వేషించువాడు నరకావాసము నక్షయముగ బొందును" అని పరాశరస్మృతి. లోకశాస్త్ర విరుద్ధమగు ఇట్టి నాస్తికాభిప్రాయమును విడిచి యెవ్వడు బ్రహ్మమును ఉన్నవానినిగా భావించునో అట్టి ఆస్తికుడు—"ఆస్తిక్యం నామ వేదోక్త ధర్మాధర్మేషు విశ్వాసః॥" (శాండిల్యా. ఉ. 2) వేదవిహిత స్వధర్మాధర్మములయం దత్యంత విశ్వాసము ఆస్తిక్యమని శ్రుతి. అట్టి ఆస్తిక్యము గలవాడు ఆస్తికుడు—"తద్బ్రహ్మ ప్రాప్తికి సాధనభూతమగు వర్ణాశ్రమ వ్యవస్థా పరిపాలన రూపమగు సదాచారమును శ్రద్ధాపూర్వకముగ నాచరించును. కావున లోకమునందు సన్మార్గుడని ప్రసిద్ధి గాంచును. కనుక లోకములో వేదశాస్త్ర విశ్వాసవంతులు మాత్రమే విగ్రహారాధన విషయమున నుదాహరణీయులు. మఱియు "అత్యంత మలినో దేహః

దేహీచాత్యంత నిర్మలః॥'' (ముక్తిక.ఉ.2-67) శరీర మత్యంత మలినమైనది. శరీరి-ప్రత్యగాత్మ-అత్యంత పరిశుద్ధుడు'' అనెడి శ్రుతి ప్రసిద్ధముగ నిత్య మత్యంత మలినమైన దగుటవలన హేయమైనదియు మలమూత్రాద్యాత్మకమునగు నీ శరీరమునందు ఆత్మబుద్ధిం జేయుచున్న జీవులకు మలమూత్రాది సంబంధ శూన్యమై నిత్యము అత్యంత పరిశుద్ధములగు నా మూర్తులయందు ఈశ్వరబుద్ధిం జేయుట యందు దోషమేమి?

శిష్యుడు:—స్వామీ! ఇట్లు ఒక్కటియె యగు అనాత్మకార్యరూపముచే ననేకమగుట యందును, ఒక్కటియెయగు ఆత్మ, ఆ యనాత్మకార్యోపాధులయం దుపహితమై ఆ యుపాధులచే ననేకమగుటయందును దృష్టాంతమును జెప్పుడు.

గు:—వత్సా! వినుము. పృథివి ఒక్కటియె యైనను అది కార్యరూపమున పరిణమించిన దగుచు పర్వతము, వృక్షము, గోపురము, కుడ్యము (గోడ) కుసూలము (గాదె) గృహము, మఠము, ఘటము, శరావము (మూకుడు) మున్నగు భేదమును ఎట్లు పొందుచున్నదో అట్లే అనాత్మయైన మూలప్రకృతి ఒక్కటియె యైనను అది కార్యమైన శరీరరూపమున పరిణమించినదగుచు అనేకమైనది. ఏ ప్రకారముగ నేకమగు ఆకాశము పృథివీకార్యోపాధులైన ఘట పటాదులయందు ప్రవేశించినదివలె ప్రతీయమానమగుచు 'ఇది ఘటాకాశము-ఇది పటాకాశము' అను మున్నగు రూపములచేత అనేకముగ ప్రకాశించుచున్నదో ఆ ప్రకారముగనే ఆత్మస్వయముగ ఒక్కటియే యైనను, ఆయా శరీరరూప ఉపాధులయందు ప్రవేశించినదివలె ప్రతీయమానమగుచు ఆయా శరీరోపాధులచేత, దేవుడు-మనుష్యుడు-రాముడు-కృష్ణుడు-బ్రాహ్మణుడు-క్షత్రియుడు-వైశ్యుడు-శూద్రుడు-పశువు-పక్షి-క్రిమి-కీటకము నని స్వయముగ బహుధా ప్రకాశించుచున్నది. "ఏకో దేవో బహుధా నివిష్టః। అజాయమానో బహుధా విజాయతే॥" (ముద్గల. ఉ. 3) అద్వితీయా ఖండైకరస పరమాత్మ ప్రకృతికార్యమైన బహువిధ శరీరోపాధులయం దుపహితుడై, తాను జన్మనిమిత్త శూన్యుడయ్యును ఆయా యుపాధిభేదమున అనేకవిధములైన జీవులుగ బుట్టుచున్నట్లు తోచుచున్నాడు. అనేకజీవులుగ ప్రతీయమానమగుచున్న చిదాత్మ-ప్రత్యగాత్మ-స్వయమేకమే. "క్షేత్రజ్ఞం చాపిమాంవిద్ధి సర్వక్షేత్రేషు భారత। క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తజ్జ్ఞానం మతంమమ॥" (గీ. 13-3) భారతా! ("భాయాం ముఖండవృత్త్యావేవ సదా రమత ఇతిభారత" = అఖండ వృత్తియందే సర్వదా రమించువాడు గాన భారత అనబడును") వెనుక చెప్పిన బ్రహ్మాదిస్తంబ పర్యంతమగు సర్వక్షేత్ర-శరీర-ములయందును, ఆయా క్షేత్రముయొక్కయు దాని ధర్మములయొక్కయు, దాని కర్మములయొక్కయు, దాని అవస్థలయొక్కయు జ్ఞాతయైయున్న ఆత్మ ఏకమును పరిపూర్ణమును అయినను తాను ఘటాదులచేత ఆకాశమువలెనే, అవిద్యచేత తన స్వరూపమునందు కల్పితములైన ఆయా యుపాధులచేతను, సుఖదుఃఖాది వికారములచేతను విభజింపబడినదివలె ప్రతి శరీరమునందును 'అహం-అహం' = 'నేను-నేను' అని 'అహం' ప్రత్యయమున కర్థముగా నున్నదై సర్వప్రత్యయ-(జ్ఞాన-) సాక్షియు ప్రత్యగ్లక్షణమునై యున్నది. అట్టి క్షేత్రజ్ఞుని అనగా

వెనుక చెప్పిన లక్షణములచేత సమస్త క్షేత్రములనుండి విభజింపబడినదియు, ఆయా యుపాధులతోను, వాని ధర్మములతోను, వాని కర్మములతోను స్పృశింపబడనిదియు ఆయా శబ్దములకు ప్రత్యయములకు అగోచరమును, ఆకాశమువలె నిరాకారము నిర్వికారము నిరంజనము కూటస్థాసంగ చిద్రూపము ఆత్మయునైన నన్ను, సమస్తశ్రుతి ప్రసిద్ధమును సత్యజ్ఞానానంద లక్షణమును, నిర్విశేషము (నిరుపాధికము)ను పరమునగు బ్రహ్మమునుగ దెలిసికొనుము. "అయమాత్మా బ్రహ్మ॥" (మాం. ఉ. 2) (ఈ శ్రుత్యర్థము పంచమ వర్ణకాంతమున చూడనగును) ఈ యాత్మయె బ్రహ్మమని శ్రుతి. ఇట్లు క్షేత్రమునుండి విభజింపబడిన క్షేత్రజ్ఞుని నన్నుగనే ఎట్లు తెలిసికొనుచున్నావో అటే క్షేత్రము అవిద్యాకల్పితమగుటచేత, స్వతఃసత్త లేనిదై యున్నందున, అధిష్ఠానమైన బ్రహ్మమగు నాయందు కల్పితముగానున్నది గాన ఈ క్షేత్రమునుగూడ నన్నుగనే - ఆత్మ వివర్తరూపముగనే యెఱుంగుము. ఇందువలన క్షేత్రము - క్షేత్రజ్ఞుడు సర్వము బ్రహ్మమే అని సిద్ధించినది. "వాసుదేవాత్మకాన్యాహుః క్షేత్రం క్షేత్రజ్ఞ ఏవచ॥" క్షేత్రము - క్షేత్రజ్ఞుడును (కల్పితము - అధిష్ఠానము) గూడ వాసుదేవ పరమాత్మ స్వరూపమే'. అను నిత్యాది శ్రుతిస్మృతులన్నియు పై యర్థమునే సిద్ధాంతము చేసినవి. క్షేత్ర క్షేత్రజ్ఞుల - ప్రకృతిపురుషుల - యొక్క యాథాత్మ్యవేదనము-అనగా 'సర్వమిద మహంచ బ్రహ్మైవ'= ఈ సర్వదృశ్యము - నేనును బ్రహ్మమే" అని ప్రత్యగ్దృష్టితో క్షేత్రమును క్షేత్రజ్ఞుని బ్రహ్మమాత్రముగ జూచుట యనెడి జ్ఞానమే సమ్యక్ జ్ఞానము-అదియే ఆత్యంతిక సంసార నివృత్తికి కారణమగునని సర్వజ్ఞుడనైన ఈశ్వరుడనగు నాయొక్క అభిమతము-నిశ్చయమని యర్థము. మఱియు ఏ జ్ఞానముచేత క్షేత్ర క్షేత్రజ్ఞుల యొక్క తత్త్వము అనగా జ్ఞాత - జ్ఞేయమును సర్వము బ్రహ్మమే యని యెఱుగబడుచున్నదో ఆ జ్ఞానమే బ్రహ్మమగు నాయొక్క జ్ఞానము (బ్రహ్మజ్ఞానము) అని సర్వవేదాంత సమ్మతము. క్షేత్ర క్షేత్రజ్ఞులను అప్రతిబద్ధవృత్తితో బ్రహ్మమాత్రముగ నవగమనమే - ఎఱుగుటయే - బ్రహ్మజ్ఞానము. ఇదియే కైవల్య కారణమని ఋషుల యభిమతము - అని శ్రుతిస్మృతి సిద్ధాంతము. ఇది యవిచ్ఛిన్న పక్షమునందు దృష్టాంతము.

ప్రతిబింబ పక్షమునందయినచో.—ఒక్కటియేయగు జలము, సముద్రము-నది-తటాకము-కూపము - ఘటజలము - అని యనేకముగ నెట్లయ్యెనో అట్లే అనాత్మయు ననేకమయ్యెను. ఆదిత్యుడు ఒక్కడే అయ్యును ఆ సముద్రాదులయందు ప్రతిబింబితుడగుచు అనేక ఆదిత్యులుగ నెట్లయ్యెనో అట్లే ఆత్మ ఒక్కటియే అయ్యును అంతఃకరణ సహితములైన సకల శరీరములయందును ప్రతిబింబితమగుచు అనేకమయ్యెను అని యుభయత్రకూడ దృష్టాంతమును తెలిసికొనవలయును. జలధర్మములైన శైత్యచలనాదులు ఆ జలనిష్ఠ ప్రతిబింబ ధర్మములవలెనే ప్రకాశించుచున్నను బింబభూతుడైన అంబరాదిత్యుని స్పృశింపనేరని విధమున, అంతఃకరణ ధర్మములైన కర్తృత్వ భోక్తృత్వాది వికారములును ఆ యంతఃకరణ నిష్ఠ చిదాభాస ధర్మముల వలెనే ప్రకాశించుచున్నను బింబభూతమైన ఆత్మను స్పృశింపనేరవు. కనుక స్పృశించుటలేదు. "అజ్ఞానాన్మానసోపాధేః కర్తృత్వాదీ నిచాత్మని।

కల్ప్యంతేఽంబుగతే సూర్యేచల నాదిర్యథామ్భసః॥'' (ఆత్మబోధ) జలధర్మములైన చలనాదులు జలప్రతిబింబిత సూర్యప్రతిబింబమునందు ఆరోపింపబడుచున్నట్లు, అంతఃకరణోపాధి ధర్మములైన కర్తృత్వాదులు అజ్ఞానము వలన ఆత్మయందు ఆరోపింపబడుచున్నవి. యథార్థముగ నాదిత్యునియందు శైత్యాది వికారములు లేవు, ఆత్మయందు కర్తృత్వాది వికారములు లేవు. ''అవికారీ వాఽయమాత్మా॥'' (బృ. ఉ.) - ఈ యాత్మ అవికారి. ''అవిభక్తంచ భూతేషు విభక్తమివచస్థితమ్। భూతభర్తృచ తద్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణుచ॥'' (గీ. 13-16) నామ రూప గుణ క్రియా జాతి స్వభావ విశేషములచేత పరస్పరము విభజింపబడి హెచ్చుతగ్గులుగా నున్న బ్రహ్మాది స్తంబ పర్యంతము గల సమస్తభూతముల - ప్రాణుల - యందు 'అహమహం' = 'నేను - నేను' అని యిట్లు అహంపదార్థమై యున్నదిగా గోచరించుచు ఉండుటవలన, వేఱు వేఱుగానున్న ఆ ప్రాణి శరీరములచేత వేఱు వేఱుగా నున్నదివలె ఆత్మ ప్రకాశించుచున్నది. కాని భ్రాంతులకు ఘటాదులచేత ఆకాశము వలెనే శరీరములచేత ఆత్మ అనేకములుగ నున్నట్లు తోచినను, ఆత్మ స్వతఃస్వరూపము చేత అవిభక్తమే - అపరిచ్ఛిన్నమే - అఖండైక రసమే - యైయున్నది. అందువలననే బ్రహ్మము యొక్క అపరిచ్ఛిన్నత్వము అద్వితీయాఖండైక రసత్వము సిద్ధించుటకొఱకే జగత్తు బ్రహ్మము యొక్క వివర్తమైయున్న సంగతి (జ్ఞానము) సూచిత మగుచున్నది. అజ్ఞాన దశయందు, జ్ఞేయమైన ఆ యాత్మయే శరీరాది ప్రపంచ రూపమున, రజ్జువు సర్పాకారముగ ప్రతీతమైనట్లు ప్రతీతమగుచున్నది. కాన ప్రభవిష్ణు అనబడును. భ్రాంతులకు బ్రహ్మమే ప్రపంచ రూపమున ప్రకాశించుచున్నదని యర్థము. ''సత్యంచా నృతంచ సత్య మభవత్॥'' (తై. ఉ. 2-7) ఆత్మయు అనాత్మయు - చేతనము అచేతనము-గూడ అద్వితీయా ఖండైక రస పరబ్రహ్మమే'' యని శ్రుతి. మఱియు నా బ్రహ్మమే తనయం దారోపితములైన సకల భూతములకు సత్తాస్ఫూర్తుల నిచ్చి వానిని భరించుచున్నది. కాన భూతభర్తయు నగును. స్వారోపిత సర్వప్రపంచమును మూఢుల వ్యవహారార్థము (నిమిత్తముగ) భరించుచున్నదని యర్థము. ''వ్యక్తావ్యక్తం భరతే విశ్వమీశః॥'' (నారద పరివ్రాజిక. ఉ. 9-7) వ్యక్తావ్యక్త రూపమైన అనగా చేతనాచేతన రూపమైన బ్రహ్మ వివర్తమగు విశ్వమునంతను పరమాత్మయే భరించుచున్నాడని శ్రుతి. మఱియు నా బ్రహ్మమే ప్రబోధదశయందు - అధిష్ఠాన యాథాత్మ్య సందర్శన కాలమునందు - స్వారోపిత సర్వమును స్వస్వరూపముగనే రజ్జువు సర్పమునువలె ఉపసంహరించుకొనును. అనగా విపరీతభావమును విడిచి బోధమయము నిర్వికారము నగు కేవల-అద్వితీయ-మైన స్వకీయ సత్తను భజించును. కాన గ్రసిష్ణు అగుచున్నది. అందువలన జీవాత్మయే పరమాత్మ. పరమాత్మయే జీవాత్మ. ఎట్లనగా ''ఘటే నష్టే యథావ్యోమ వ్యోమైవ భవతి స్వయం। తథైవోపాధి విలయే బ్రహ్మైవ బ్రహ్మవిత్స్వయం॥'' (ఆత్మ. ఉ. 22) ఘట వినాశమునందు ఘటాకాశము తాను మహాకాశమే యగుచున్న విధముననే, బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానసిద్ధివలన శరీరత్రయ వినాశమునందు బ్రహ్మవిదుడు తాను పరబ్రహ్మమే యగుచున్నాడు.'' అనెడి శ్రుతిమానమున ఘటాకాశమే మహాకాశము -

మహాకాశమే ఘటాకాశమువలె జీవాత్మయే పరమాత్మ – పరమాత్మయే జీవాత్మయని తెలిసికొనుము. మఱియు "ఘటాకాశం మహాకాశ ఇవాత్మానం పరాత్మని। విలాప్యాఖండభావేన తూష్ణీంభవ సదామునే॥" (అధ్యాత్మ. ఉ. 7) తత్త్వజ్ఞుడా! వివేకబుద్ధిచే ఘటాకాశమును మహాకాశమునం దైక్యమొనరించిన రీతిని, స్వాత్మవిజ్ఞానముచే ప్రత్యగాత్మను పరమాత్మయం దైక్యమొనరించి యఖండభావమున సదా నిర్వ్యాసనామౌని వగుము.

శి:—స్వామీ! జీవాత్మ కల్పితమై యుండుట వలన, కల్పిత మసత్యమగుటవలన, ఆ కల్పిత జీవాత్మకు సత్యమైన పరమాత్మతో అభేదము ఐక్యము ఎటుల సిద్ధించును?

గు:—వత్సా! వినుము. పారమార్థికుడు – వ్యావహారికుడు – ప్రాతిభాసికుడు నని జీవుడు మూడు విధములు. ఈ త్రివిధజీవులు క్రమముగ సుషుప్తి జాగ్రత స్వప్నావస్థలయం దభిమానులు. ఏ ప్రకారము జలమునందు తరంగము కల్పితము, తరంగమునందు ఫేనము కల్పితము అగుచున్నదో ఆ ప్రకారము పారమార్థికుని యందు వ్యావహారికుడు కల్పితుడు, వ్యావహారికునియందు ప్రాతిభాసికుడు కల్పితుడు అగుచున్నాడు. మాధుర్యద్రవత్వ శైత్యాది జలధర్మములు పారమార్థిక జలమునందే యున్న వగుచు తరంగమునందు ప్రకాశించుచున్నవి. తరంగముద్వారా ఫేనమునందుగూడ ప్రకాశించుచున్నవి. అటులనే సచ్చిదానందములు పారమార్థిక కూటస్థునియందే యున్నవగుచు వ్యావహారికుని యందు ప్రకాశించుచున్నవి. వ్యావహారికుని ద్వారా ప్రాతిభాసికునియందు గూడ ప్రకాశించుచున్నవి. ఏ విధమున ఫేనము తరంగము వినాగా లేదో, తరంగమును జలము వినాగా లేదో, జలమే పరమార్థభూతమో ఆ విధముననే ప్రాతిభాసికుడు వ్యావహారికుడు వినాగా లేడు. వ్యావహారికుడు పారమార్థికుడు వినాగా లేడు. పారమార్థికుడే యథార్థము. "యథానతోయతో భిన్నాస్తరంగాః ఫేన బుద్బుదాః। ఆత్మనోనతథాభిన్నం విశ్వమాత్మ వినిర్గతం॥" (అష్టావక్రగీత. 2-4) జలమునందు బుట్టిన తరంగ ఫేన బుద్బుదములకు జలసత్తకంటె నన్యసత్త లేనిచందమున ఆత్మయం దారోపింపబడిన విశ్వమునకు ఆత్మసత్తకంటె నన్యసత్త లేదు. తరంగ ఫేన బుద్బుదములకు జల మధిష్ఠాన మైనందున నవి జలముకంటె నెట్లు వేఱుగావో యట్లే సర్వప్రపంచమున కధిష్ఠానమైన చిద్రూపాత్మకంటె జగత్తు వేఱుకాదు. "యథేక్షురస సంవ్యాప్తా శర్కరా వర్తితేతథా। అద్వయ బ్రహ్మరూపేణ వ్యాప్తోహంవై జగత్త్రయం। బ్రహ్మాది కీటపర్యంతాః ప్రాణినో మయికల్పితాః। బుద్బుదాది వికారాంతాస్తరంగాస్సాగరేయథా॥" (ఆత్మబోధ. ఉ. 13, 14) చెఱకు రసమునుండి సిద్ధమైన చక్కెర చెఱకు రసముచేతనే పరిపూర్ణముగ సంవ్యాప్తమైయున్న తెఱంగున ఆత్మయం దారోపితమైన జగత్త్రయమునందును పరిపూర్ణముగ అద్వయ బ్రహ్మరూపముచేత నేనే వ్యాపించియున్నాను. బుద్బుదాది వికారాంతములైన తరంగములు సముద్రమునందు గల్పితములైన చందమున బ్రహ్మాది కీట పర్యంతములైన సమస్తప్రాణులు నా – ఆత్మ – యందు గల్పితములు. ఆత్మకంటె ప్రపంచము వేఱుకాదు. మిథ్యయని భావము అని శ్రుతిస్మృతులు బోధించుచున్నవి. అందువలన పరమార్థభావముచేత ఘటాకాశము మహాకాశమే యైనట్లు పారమార్థికుడైన కూటస్థుడు పరమాత్మయే యని సిద్ధాంతము.

(సశేషము)

# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

బేలూరు మఠము,

4-4-1917

ప్రియ దే—

నీవు మొదటితారీఖున వ్రాసినయుత్తరమును జూచి యెంతయో యానందించితిని. నీశరీరస్థితి బాగున్నదనివిని చాలసంతసించితిని. 'మనస్సు చెడిపోలేదు; ఎల్లప్పుడు సద్భావములే కలుగుచున్నవి. సత్సంగముకొఱకు ఆకాంక్ష జనించుచున్నది.'—ఇట్లు వ్రాసితివి. ఇవన్నియు సల్లక్షణములు. విషయాలోచన, విషయులతోడి సాంగత్య విముఖత—ఇవన్నియు మంచివి, వాంఛనీయములయినవియును. భగవానుడొక్కడే సమస్త జీవులకు నుపాయము, మరియు నుద్దిశ్యవస్తువు. కావున ఆయనను సంతతము చింతించుచుండుము. ఇక యోచన లేల ? ఆయనయే సమస్తమును చక్కబెట్టును. ఆయన నిన్నెట్టిస్థితియందుంచినను నీ మనస్సు ఆయన చరణములయందే లగ్నమైయుండవలయునని ప్రార్థింపుము. ఆయన మనలనెట్లుంచినను మేలే. 'హాఫీస్' అను నతడిట్లు వక్కాణించియున్నాడు. 'నా దేవుడు నన్ను దారిద్ర్యధూళి దూసరితావస్థయందుంచి వీక్షింపవలయునని కోరునపుడు నేను స్వర్గ సరోవరముపై దృష్టినిలిపినచో అది నా హైన్యమునే బయలువెట్టును. ఆయన నన్నెట్టిస్థితియందుంచినను దానికి నేను బద్ధుడనైయుందు ననుకొనుటయే యుత్తమము. ఏలనన ఆయన మంగళమయ సర్వాంతర్యామి. ఎవరికెది యుక్తమో ఆయన యెఱుగును. దానికి వలయు నేర్పాట్లు గావించును. మధ్యేమధ్యే నేను నాయిష్టాను సారము వాంఛించుటవలన సమస్తమును కళంకిత మగుచున్నది, చెడిపోవుచున్నది. ఆయన నన్నెచటనుంచినను సరియే; నామనస్సు మాత్రము ఆయన చరణ లగ్నమగునట్లొనర్చిన జాలును. 'శ్లో. వనేపిదోషాః ప్రభవంతి రాగినామ్; గృహేఽపి పంచేంద్రియనిగ్రహః తపః' *

ఉన్న విషయమిదియే. ఎందుండినను 'నిన్ను మఱువనియట్లును విషయలంపటుల సంఘమున గాక నీ భక్త సంఘమున బ్రవర్తిల్లునట్లును నన్నాశీర్వదింపు'మని ప్రార్థించుటయందెంతయు దోషములేదు. మనఃపూర్వకముగా ఆయనను బిలువుము. ఆయన నీకు శ్రేయస్సునే కలిగించును.

ఆయన ఎన్నాళ్లు నిన్నింటనుంచునో అన్నాళ్లు నీకన్నతల్లిని సేవింపుము. ఆమెనే జగజ్జనని స్వరూపముగాదలంచి, శుశ్రూషాదుల నాచరింపగలిగినచో నీకెంతయో శుభముకలుగును. భగవానుడు నిన్ను నడిపెడి మార్గముననే నిలు

---

* శ్లో. వనేపిదోషాః ప్రభవంతి రాగినామ్
గృహేపి పంచేంద్రియ నిగ్రహః తపః
అకుత్సితే కర్మణి యః ప్రవర్తతే
నివృత్తరాగస్య గృహం తపోవనం.

హితోపదేశము 4 వ అధ్యాయము

విషయవాసనాలంపటుడు అడవికి బోయినను దోషములు పొడసూపును. శుభకర్మములందే ప్రవృత్తిగలవారు ఇంటనుండియు పంచేంద్రియ నిగ్రహము గావించినచో అది తపమని వక్కాణింపబడును. ఆసక్తిశూన్యుడగు పురుషుని గృహమే తపోవనము.

వుము; మేలు కలుగును. ఇం దావంతయు సందియమువలదు. భగవత్ప్రతిపాదితమగు మార్గానుసరణమే మనయందరి కర్తవ్యము.

నా ఛాయాచిత్రమును పూజాస్థానమున నుంపకుము. దానిని వేఱొకచోట బెట్టుము. శ్రీ రామకృష్ణగురుదేవుడే ఆరాధ్యుడు, పూజార్హుడు. త్రికరణశుద్ధిగా శ్రీవారిని పూజింపుము. శ్రీవారి నారాధించినచో కర్తవ్య మితరమేదియు నుండబోదు. చెట్టు మొదట నీరుపోసినచో వృక్షము సమస్తము తృప్తినంది నానాటికి వృద్ధిజెందును.

ఇట్లు,
నా శుభాకాంక్షలతో,
శ్రీ తురీయానంద

# సంఘవార్తలు

చెన్నపురి శ్రీ రామకృష్ణమఠమున

## శ్రీ రామకృష్ణపరమహంసదేవుని

### నూట పదునెనిమిదవ జన్మదిన మహోత్సవము

చెన్నపురి శ్రీ రామకృష్ణమఠమున శ్రీ రామకృష్ణపరమహంసదేవుని నూటపదునెనిమిదవ జన్మతిథిపూజ 15-2-1953 ఆదివారము ఉదయము 8—12 గంటలమధ్య జరుపబడినది. హోమానంతరము వందలకొలది దరిద్రనారాయణులకును భక్తులకును అన్న ప్రసాదము పెట్టబడినది.

22-2-1953 ఆదివారమునాడు బహిరంగోత్సవము జరుపబడినది. ఆ నాడు ఉదయము 8—10 ఘంటలమధ్య శ్రీ రామకృష్ణబోధామృత పారాయణము జరుపబడినది. ఆపిమ్మట పూజ్యపాదులు శ్రీమత్ ఋతజానందస్వాములవా రుపన్యసించిరి.

మధ్యాహ్నము 3—4-30 ఘంటల మధ్య శ్రీ శ్రీ తిరువయ్యారు అణ్ణాస్వామి భాగవతారుగారిచే హరికథా కాలక్షేపము కావింపబడినది.

4-30—5 గంటలమధ్య పోటీపరీక్షల యందు బహుమతులు పొందిన విద్యార్థులు తమ వక్తృత్వముచే సభికుల రంజింపజేసిరి.

ఆపిమ్మట ప్రొఫెసరు: శ్రీరం. వేంకట భుజంగరాయశర్మ బి. ఏ. (హానర్స్) గారు ఆంధ్రమున నుపన్యసించిరి. శ్రీ రామకృష్ణ మఠము స్వామివారగు శ్రీ శుద్ధసత్త్వానంద స్వామివా రాంగ్లమునను, శ్రీ ఎమ్. ఎస్. చెల్లమ్ ఎం.ఏ., ఎల్.టి గారు తమిళమునను, ప్రొఫెసరు ఎన్. రమణి ఎం. ఏ. గారు ఆంగ్లమునను నుపన్యసించిరి.

తరువాత బహుమతులు పంచిపెట్టబడినవి. నాటిసభకు అధ్యక్షతవహించిన ప్రొఫెసరు శ్రీ డి. ఎస్. శర్మగారు తమ అధ్యక్షోపన్యాసముతో సభికుల నానందింప జేసిరి. *

కార్యనిర్వాహకుల అభివందనములతో సభాకార్యక్రమము జయప్రదముగ ముగిసెను.

---

* స్థలాభావమునజేసి ఉపన్యాసములు ప్రచురింపజాలక పోయితిమి. రాబోవు సంచికలందు వీలు ననుసరించి వానిని ప్రచురింపగలము.
—సంపాదకులు.

## కాకినాడలో శ్రీ స్వామి రాఘవానందజీ మహరాజ్ వారి

# ఉద్బోధన

### శ్రీ గూడా మంగపతిరావు

కాకినాడ,
ఫిబ్రవరి, 8.

స్థానిక దివ్యజ్ఞాన సమాజ గౌతమ భవనములో ఫిబ్రవరి 5, 6, 7 తేదీలలో సాయం కాలములందు జరిగిన బహిరంగసభలలో కలకత్తా-బేలూరుమఠస్వామి శ్రీ రాఘవానందజీ మహరాజ్ వారు 'హైందవమతసంస్కృతి', 'పశ్చిమదేశములకు వేదాంతసందేశము', 'శ్రీ వివేకానందస్వామి సందేశము' అను విషయములనుగూర్చి ఉపన్యసించిరి.

"భారతావనిలో ప్రాచీనకాలమునుండియు మతరహితముగ శాస్త్రములుగాని, కార్యాచరణముగాని విధింపఁబడియుండలేదు. ప్రతి విషయమునందు దేవునిపై నాధారపడి హైందవులు కర్మల నాచరింతురు; మత సంస్కృతి దైనందిన జీవితములో భాగమై విలసిల్లుటచే నేఁటికిని సాధుసత్పురుషుల నాదరించి గౌరవించుచున్నారు. అమెరికావంటి పాశ్చాత్య దేశములలో మతరహిత ప్రవర్తన వర్థిల్లుచుండుటకు నిదర్శనముగ క్రైస్తవమతస్థుఁడొకఁడు "గన్ పౌడరు కనిపెట్టఁబడిన తరువాత మేమార్థిక మధువును గ్రోలుచున్నా"మని చెప్పెను. భక్తిజ్ఞాన కర్మ ధ్యానాది యోగ మార్గములు సంపూర్ణ మానవుఁడగుటకు సహకరించును. వీనియన్నిటియం దనుభవమున్నవారే పరిపూర్ణ జీవనమును జీవించి సిద్ధి నొందగలరు. అట్టివారిలో శ్రీ రామకృష్ణపరమహంస ప్రముఖుఁడు. ఒక సమాజమునకు చెందినవారు శ్రీ రామకృష్ణశారదాదేవుల వైవాహిక సంబంధమును భౌతిక బాంధవ్యముగా భావించి శ్రీ రామకృష్ణుఁడామెను దూరమున నుంచి క్రౌర్యబుద్ధితో బాధించెనని యారోపింపగా వారి దాంపత్యము భౌతిక బంధముతోపాటు ఆధ్యాత్మిక సంబంధము గలిగియుండెననియు, నట్టిది హైందవమత సంస్కృతికి వ్యతిరిక్తము కాఁజాలదని సాక్షిమొల్లరు మహాశయుఁడు సమాధానమిచ్చియున్నాఁడు. జగజ్జాలుఁడైన భగవంతుఁడు వెనుక నున్నాఁడని తెలిసి వ్యవహరించుట లౌకికజ్ఞాన మనిపించుకొనును; అనంత చైతన్యస్వరూపిణియగు జగదంబ యున్నదని తెలిసి కార్యముల నాచరించుట ఆధ్యాత్మికతయగును.

'నీరు పల్లమెఱుగు' నట్లు విజ్ఞానసంస్కృతి ఖండ ఖండాంతరములకు సందేశముల రూపమున ప్రసారితమగును. ప్రస్తుత ప్రపంచపుటవినీతికి ఆధ్యాత్మికచింతన, పార లౌకికాప్తి క్షీణించుటయే కారణము. కాంక్షను సంతృప్తిపఱపఁజూచుటయే నూత్నకామనలకు దోహదమిచ్చుట యగును. ప్రథమ ప్రాచ్యదేశ విజేతయగు నలెగ్జాండరు భారతావనిపైకి దండెత్తి వచ్చి భారతీయ ఋషుల యార్షసంప్రదాయముల కలరి, తన దేశమునందా విజ్ఞాన పుంజమును వ్యాపింపఁజేయు నుద్దేశముతో వారిని

నాహ్వానింప నాతపోధనులు ౧. మానుషిక బలమును వినియోగించి నశ్వరశరీరమును బాధింప వచ్చునుగాని, నిత్యసత్య రససిద్ధి పథమున నిల్చు అంతరాత్మ నా కార్యములు గాసి నొందింపవు; ౨. సిరిసంపదలు మన శ్శాంతి నొసఁగఁజాలవు. ధ్యానాద్యష్టాంగ యోగ మార్గానుసరణమున ఆత్మైకానందానుభూతి నొంది సుఖియింపవచ్చునని బోధించిరి. దుష్కర్మ నాశనమేగాక, కర్మక్షయమును బడయవలెను. అకర్మ, వికర్మల కతీతమైన పరోపకార నిబద్ధమైన ఫలాపేక్ష రహిత నిష్కామకర్మయే యుత్తమగతి ప్రదాయిని. 'పైథాగరసు; సోక్రటీసు' మున్నగు పాశ్చాత్య తత్త్వశిఖామణులు మన ప్రాచీన వేదాంతతత్త్వమునం దచంచలవిశ్వాసమునుంచి పశ్చిమదేశములందు తత్కాంతిపుంజమును ప్రసరింపఁజేసినారు. అదియే నేడు ప్రచారము నందున్నది. నిత్యలౌకిక, రాజకీయ వ్యవహారములను సయితము భగవదర్పితముగా నెరవేర్చిననాఁడే మన దేశము అంతర్జాతీయముగా నాయకమణియై ప్రముఖపాత్ర వహించు ముహూర్తము లాగమించునని ఆశింతము. బౌద్ధ యుగములోఁ బ్రాగ్దేశ విజ్ఞానులను గొనిపోయి పాశ్చాత్యు లుజ్జీవితులైనారు. భగవద్గీత యందుఁ బ్రస్ఫుటితమై వెలుగు సిద్ధాంతము తీవ్రప్రవృత్తియు, దానియందుండు తటి నిరంతర శాంతియునై యున్నది. • వేదాంతమునకు పరమావధియగు నీ సిద్ధాంతమే కర్మరహస్యము.

తత్త్వజిజ్ఞాసువైన మానవుని ప్రకృతి పరిస్థితులు కష్టములపాలుజేసి జీవితము దుర్భర మొనరించును గనుక, దుఃఖమును దిగమ్రింగి కరుణ సహనభావములతోఁ గష్టముల నెదుర్కొనుచు సాధనా సరళిలో బుద్ధదేవునివలె పురోగమింపవలెనుగాని, శ్రమలకు క్లిష్టపరిస్థితులకు భయపడి తిరోగమించుట లాతికర్జము కాదు. సంగీతాది కలాభ్యాసములకు వలసినట్లే గురుముఖ శాస్త్రమగు బ్రహ్మవిద్యకు నుత్తమ తత్త్వానుభూతినిబడసి ఆనందించుటకు బాహ్యేంద్రియ విషయ నిరోధముచే మనో బుద్ధీంద్రియ వికాసములవలన వైరాగ్యప్రాతిపదికను బుద్ధునివలెఁ బూని; సాను క్రోశ, సానుతాపములఁ బడయనేర్చినపుడె మత సంస్కృతి ప్రారంభమగును. అందుచేత మత మందఱికొఱకును నిర్దేశితముగాదు. కామినీ కాంచనములయెడఁ గల మోహమును త్యజించి ధర్మపురుషార్థముతో మొదలుకొని యనేకజన్మల సాధన ఫలితముగ ముక్తిఁబడయనేర్చుట భారతర్షుల సొత్తు.

శ్రీ వివేకానందస్వామి జీవితసంఘటనలు భారతదేశ చరిత్రమును దీర్చిదిద్దినవి. నరుఁడను ఋషి తపోనిష్ఠుఁడై యుండునెడ నొక పిలుపు వినఁబడినంత నాయన యందుండి యొక యంశ వెలికివచ్చి నరేంద్రునిగా నావిర్భవించుట సంభవించినది. నరుని తేజమును నరేంద్రునిలో గుర్తించినవాఁడు శ్రీ రామకృష్ణ పరమహంస యొకఁడే! దక్షిణేశ్వరముని మధుర బోధనములు నరేంద్రుని మానసము నుత్తేజిత మొనర్చి వానికిఁ దెలియకుండఁగనే గురుదేవుని దివ్యప్రభావ దిధీతిసంతతి పనిఁజేసినది. కొన్ని సమాజములలోఁ జేరియును భగవంతుని గనుఁగొన విఫలుఁడై, నాస్తికుడుగా మారిన నరేంద్రుని శ్రీరామకృష్ణుఁడు కేవల స్పర్శ మాత్రమున వివేకానందునిగ మార్చివేసెను. విశ్వప్రేమతోఁ దొలఁకాడుచుండు వేదాంత కేసరి ప్రాపంచిక సౌఖ్యములఁ దిరస్కరించి

గురునియట్లు సర్వసంగ పరిత్యాగియై జగద్గురుఁడయ్యెను. మానవునియందలి దైవత్వము ప్రాక్పశ్చిమ దేశములకుఁ గొంపోయి, చాటించి చెప్పుటను వేదాంత సందేశమును మాత్రుకఁగాఁ గైకొన్న వివేకానందుఁడు ముమ్మారు కాళీమాతృచరణ సన్నిధికేగి తనకుఁ బ్రాప్తించిన దుస్థితిఁ దొలఁగింపఁ గోరక, తన్నొక విజ్ఞానయాత్రికునిగా నొనర్ప వేడికొన్న మహిత మహనీయమూర్తి. విశ్వవ్యాప్తమైన జీవుని రూపజిన శివునిగా నెఱిఁగి యందఱి మానవులతోఁబాటు దీన, దరిద్రనారాయణులను సమానముగా ప్రేమతో సేవించి వారి క్షేమమును జూచుట యను ప్రజాస్వామ్య సిద్ధాంతమును బాటించవలయును. సామ్యవాదాది సిద్ధాంతములాచరణాశయములందు స్వల్పభేదములున్నను, ఏకాదర్శ ప్రదర్శనములై విశ్వమానవ సౌభ్రాత్రమును సాధించుచున్నవి.''



# గ్రంథసమీక్ష

## గీతావాణి

(గీతాజయంతి ప్రత్యేక సంచిక) సైజు: డెమ్మీ: 1/8. పుటలు 78. వెల 0-12-0 లు. ప్రత్యేక సంచికతో సాలు చందా నాల్గు రూపాయిలు. సంపాదకులు: (శ్రీ) (శ్రీ)కంఠం గారు. గౌరవ సంపాదకులు: పూజ్యపాద శ్రీ శంకరానందస్వామి. నిర్వహణ: గీతా ప్రచురణ సమితి, ఆళ్లగడ్డ, కర్నూలుజిల్లా. ఎడిటోరియలు ఆఫీసు (గుళ్లదూర్తి), కోయిలకుంట్ల.

''గీతా సుగీతా కర్తవ్యా
కిమన్యైః శాస్త్ర విస్తరైః
యా స్వయం పద్మనాభస్య
ముఖ పద్మాద్వినిస్సృతా.''

ఇట్టి మహోత్కృష్ట గ్రంథమునందలి ఆధ్యాత్మిక విజ్ఞానమును ఆంధ్రప్రజలకు అందజేయుచున్న మాసపత్రిక ఇది. గీతా ప్రచారమును, గీతాసేవను ముఖ్య ఆశయములుగా పెట్టికొని, పలువురుదాతల సహకారముతో గీతాప్రచార సేవాసమితి సభ్యులు దీనిని ప్రచురించుచున్నారు. గీతా తత్త్వ రహస్యము పలు వ్యాసములతో పాఠకులకు ప్రసాదింపబడినది. శాంకర సిద్ధాంతము కూలంకషముగా వివరింపబడినది. ''గీతకు నిత్యజీవితముతో సంబంధము'', ''భగవద్గీత నేటి పరిస్థితి'', ''గీతా వైశిష్ట్యము'' మొదలగు వైజ్ఞానిక వ్యాసములు చాల గలవు. ఆంధ్రలోకమునకు చిరపరిచితులైన శ్రీ మళయాళస్వాములవారు, శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారు, శ్రీ కె. సచ్చిదానందమూర్తిగారు, శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారు, శ్రీ నోముల అప్పారావుగారు మొదలగు తత్త్వవేత్తలైన రచయితల వ్యాసములు చదివి పాఠకులు ధన్యులయ్యెదరుగాక! శ్రీమంతులగు ముముక్షువులు ఇట్టి ధార్మిక ప్రబోధమునకు సహాయమొనరించెదరుగాక!

## గీతాదర్శనము

రచయిత : శ్రీ నారాయణస్వామిజీ. అనువాదకులు : శ్రీ దమ్మాలపాటి రామకృష్ణ శాస్త్రి. ఫూల్స్ కేప్ 1/16 సైజు. 598 పుటలు. వెల రూ. 5. ప్రాప్తిస్థానము : శ్రీరామతీర్థ సేవాశ్రమము, పిడుగురాల పోస్టు, గుంటూరు జిల్లా.

ఈ గీతాదర్శనమునందు అనువాదకులు ఆంధ్రమున చక్కనిభాషను ప్రయోగించియున్నారు. ఈ గ్రంథము గీతార్థము చక్కగ వివరించుటయే కాక వేదాంతమతముతో గీతకుగల పొత్తును ఎంతయో మనోహరముగ వివరించుచున్నది. పూర్వమీమాంస, షడ్దర్శనములు ఉపనిషత్తులు – ఇట్టి వేదాంత గ్రంథములకును గీతకును గల సమైక్యత విపులముగా ప్రబోధింపబడియున్నది. భక్తి, కర్మ, జ్ఞాన, రాజయోగముల సమన్వయ మిందు చక్కగ విశదీకరింపబడియున్నది. గ్రంథము చివర గీతామాహాత్మ్యము సతాత్పర్యముగ ముద్రింపబడియున్నది. శ్రీకృష్ణార్జునుల నామముల వ్యుత్పత్తులుగూడ వివరింపబడియున్నవి.

ఆధ్యాత్మికపథమున జరించు ముముక్షు జనసందోహమునకు గీతాదర్శనము దర్శనప్రాయమై సమస్త విషయములను చక్కగ దెలియజేయగలదు.

---

## శ్రీ కబీరు చరిత్రము

గ్రంథకర్త : శ్రీ దండా నరసింహకవి, బరంపురం. డెమ్మీ 1/8 సైజు. 160 పుటలు. వెల : రూ. 2. వలయువారు : శ్రీ దండా నరసింహకవి, చిన్నబజారు, బరంపురము, గంజాంజిల్లా అని వ్రాయవలయును.

ఈ గ్రంథము మూడాశ్వాసముల సలలిత పద్యకావ్యము. ప్రబంధరీతిని రచింపబడియున్న ఈ కావ్యము భక్తజనులందరును జదువదగినది. ఇందు వైష్ణవము, అద్వైతము మున్నగు మత విషయములు మృదుమధురమగు శైలియందు రచింపబడియున్నవి. చతుర్విధ కవితారీతులతో నలరారుచున్న యీ గ్రంథము, బాల కవులకు కవితారీతుల దెలుపగలిగియున్నది.

మచ్చునకు : నిరోష్ఠ్యము

క. ధరణీచర ఖేచర హరి
కరి హరి ఖగ లేలిహాన ఖరకర రజనీ
కర జలధర నగ ధరణిజ
సరసీజజ గగన తార సన్నుత చరితా.

బంధకవిత్వము : మాలికాబంధము

చ. మురహర నారదాది మునిముఖ్య
ముఖాంబుజ కంజరంజనా
వర సురసారసోద్భవ శివ ధ్రువ
రక్ష ధరాధరాధరా
ఖరహరణా రమేశ కవికల్పక
భూజమ కామకామ శ్రీ
ధరపర నారసింహ ధవ ధర్మ
ధరా భవభావభావనా

ధారాశుద్ధికి ఉదాహరణము :

శా. సారక్షీణక నైరిషట్కయుత
హింసావ్యాప్త భీత్యుగ్ర సం
సారాశాపరిహీనుడయ్యు
సరసీజాతప్రభూతాది స
ద్వారాలంఘ్యతర ప్రసిద్ధగుణ
నిర్వాణేశ ఘమాయోజ్వల
ద్వారాశిప్రవిమగ్నుడై చు దన
యవ్యామోహలగ్నాత్ముడై.

# శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర

శ్రీ చిరంతనానందస్వామి విరచితము

శ్రీ రామకృష్ణుని సహధర్మచారిణియు ఆదర్శయోగిని, ఆదర్శమాతయు నగు మహనీయురాలి సమగ్ర జీవిత చరిత్ర!

అర్థముననే కాక భాషనుగూడ మీ యీ రచన అమృతధారావాహిని ...మీ గ్రంథము వాఙ్మయమున చిరస్థాయి.

—వేటూరి ప్రభాకరశాస్త్రి

ప్రతి స్త్రీయును పురుషుడును... చదువవలసిన గ్రంథమిది...అమృత కలశము!...అనన్య సామాన్య నీతిమంజరి...తియ్యని తెలుగు...పాలవంటి శైలి...

—ఆంధ్రప్రభ

256 పుటలు　　వెల : రూ. 1-12-0

ఇట్లు వ్రాయుడు : శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీ రామకృష్ణ లీలామృతము

496 పుటలు దివ్యమగు ద్వితీయ ముద్రణము! రూ. 5-0-0

## బ్రహ్మానంద బోధనలు

344 పుటలు ప్రజ్వలమగు ప్రథమ ముద్రణము! రూ. 3-8-0

## శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము)

**540 పుటలు** సర్వాంగ సుందరమగు చతుర్థ ముద్రణము వెల రూ. **3-4-0**

## శ్రీ మద్భగవద్గీత

**480 పుటలు** శ్రీధరీయ టీకాసార ప్రతిపద టీకాతాత్పర్య విశేషార్థ సహితము రూ. **3-0-0**

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

**432 పుటలు** పండిత పామర రంజకమైన శైలి. అందమగు 6-వ కూర్పు రూ. **3-0-0**

## శ్రీ శారదాదేవి చరిత్ర

**256 పుటలు** ఇంటింటను ఉండతగిన దివ్యగ్రంథము. ముద్దులొలుకు రెండవ కూర్పు వెల రూ. **1-12-0**

## శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

**186 పుటలు** (ఆదర్శప్రాయుడగు గృహస్థుని జీవితము) వెల రూ. **1-4-0**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| శారదా ప్రసంగములు ... | 2 | 8 | 0 | గురూపదేశములు ... | 0 | 8 | 0 |
| ప్రబోధరత్నాకరము ... | 2 | 4 | 0 | నా సంస్కరణ యుద్ధవిధానము ... | 0 | 6 | 0 |
| రాజయోగము ... | 2 | 4 | 0 | నా గురుదేవుడు ... | 0 | 6 | 0 |
| కర్మయోగము | 1 | 8 | 0 | శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | 0 | 4 | 0 |
| భక్తియోగము ... | 1 | 4 | 0 | నవీన భారతదేశము ... | 0 | 4 | 0 |
| వివేకానందలేఖావళి (మొదటి భాగము) | 1 | 8 | 0 | ముక్తిమార్గము ... | 0 | 8 | 0 |
| వివేకానందలేఖావళి (రెండవ భాగము) | 1 | 8 | 0 | సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | 0 | 8 | 0 |
| అనుష్ఠాన వేదాంతము ... | 1 | 4 | 0 | శ్రీ రామనామ సంకీర్తనము ... | 0 | 1 | 0 |
| వివేక సూర్యోదయము ... | 1 | 0 | 0 | యతిగీతము (పద్యకావ్యము) ... | 0 | 1 | 0 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | 0 | 12 | 0 | నా మతము 0 0 6 డజను | 0 | 5 | 0 |
| భక్తిమార్గము ... | 0 | 8 | 0 | సింహ గర్జన 0 0 6 డజను | 0 | 5 | 0 |
| చికాగో నగరోపన్యాసములు ... | 0 | 8 | 0 | | | | |

ఇవియే కాక

సంస్కృత, ఆంగ్ల, ద్రావిడ, హిందీ, కన్నడ గ్రంథములును

**వేదాంతకేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)**

అను మాస పత్రికలును మావద్ద దొరకును

ఇట్లు వ్రాయుడు:

మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి.

సంపాదకులు : శ్రీ ఋతజానందస్వామి
శ్రీ కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 17-3-53.